# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

SANKAR...

1st Sept. '54



Photo by V. R. Ramani



బహుమతి
పొందిన వ్యాఖ్య

'బోసినో ర్విప్పితే....

పంపినవారు :
ఎస్. సుబ్బారావు - అరుగొలను

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

పూర్వం రాజభక్తికి పేరుపొందింది మన దేశం. రాజుకోసం, రాజ్యంకోసం ప్రాణాలనైనా అర్పించడానికి వెనుదీయని మంత్రులూ, భృత్యులూ ఎందరెందరో ఉండేవారు. అటువంటివారికి ఉదాహరణ ఐనదే ఈ సంచికలోని కనిష్కుడి కథ. కనిష్ఠుడు దయాశీలుడు, ధైర్యశాలి. ఆటువంటివానిని అవమానింపజూచాడు సామంతుడైన కన్యాకుబ్జరాజు. తీరా కనిష్కుడు ప్రతీకారం చేయబోతే నిబ్బరంతో నిలబడలేక కుంగిపోయాడు. అలాంటి సమయంలో అతిచతురుడైన అతని మంత్రి, కోరి తన చేతిని తెగగొట్టించుకొన్నాడు. ఈపాటి త్యాగమైనా చేయకుంటే కనిష్కుడువంటి ధర్మప్రభువును నమ్మించటం అసాధ్యం అని అతనికి తెలుసు; ఈ త్యాగం సాకుగా యుక్తిచేసి కనిష్కుని మనసు కరగించి, తన ప్రభువును కాపాడగలిగాడు.. త్యాగం చిన్నదే ఐనా, ఈ కథలో ఫలితం గొప్పగా పరిణమించింది.

సంపుటి 15 : సెప్టెంబర్ 1954 : సంచిక 3





CHITRA




# నక్క - కోతి

సహజ ఘనతయే కిరీట మనగా
మహారణ్యముల నేలిన సింహము
గుహ ముందర మరణించియుంట గని
హాహాకారము చేసె జంతువులు.

ఉడుత మొదలు మత్తేభము వరకూ
అడవుల తిరిగే అన్ని మృగాలూ
మళ్లీ తమ కొక రాజు నెన్నుకొన
గోలగోలగా సభగావించి

విఘ్నేశుని దయ కలుగుగాక! యని
గున్న యేనుగును పంపించి
రాక్షస రక్షిత రత్న కిరీటము
తక్షణ మచటికి తెప్పించినవి.

మూతతీసి యా మకుటము చూచి
ఏ తల కది చక్కగ అమరునొ
ఆ తల గల మృగమే తమ రా; జని
ప్రతిన చేసుకొనె సభిక జంతువులు.

కోతి కిరీటము పెట్టి చూడగా
ప్రతి జంతువు తల పరీక్ష సాగె
మూతో ముక్కో కొమ్ములో అడ్డుగ
ఏ తలకూ అది అమరకుంట గని

(గేయకథ)

అఖరి కిక తన వంతు వచ్చెనని
ఆ కిరీటమున తన తల దూరిచి
చేతులతో దిగజారగ నీయక
ఎత్తి పట్టుకొని కిచకిచ మంటూ

గెంతే కోతిని వింతగ చూచుచు
సంతోషంతో జంతువు లన్ని
"జంతుస్తాన్‌కీ జయం జయం! హను
మంతస్వామికి జై జై" యన్నవి.

కోతి యిలా మృగ రాజవగా, అది
జిత్తుల నక్క కసహ్యము కాగా
"మీకు చెందు మీ బండారం మరి
నాకే తెలియును చూతర!" యనగా

అక్కజ పడుతూ వెంటనె పోయి
నక్క చూపిన గోతిలో కోతి
ఛివాల్న దూకెను; శివశివ! పాపం!
ఎవరో పెట్టిన బోనట నున్నది.

కత్తుల బోనులో కటకట పడు నా
కోతిరాజు గని నక్క యనెకదా
"ఉత్తమ వర్తన యేమో తెలియక
పెత్తనానికిటు ఆసతగున!" యని.



# అట్టమీది బొమ్మ

పంచపాండవులు అరణ్యవాసంలో ఉండి అనేకమైన దివ్య గాథలు వింటూ ఉన్నారని చెప్పాముకదా. ఇరవైయొక్క మారులు క్షత్రియులపై దండెత్తిన పరశురామునిగురించి చెప్పమని ధర్మరాజు కోరగా, అకృతవర్ణుడు ఇలా చెప్పాడు :—

'పూర్వకాలమందు జమదగ్ని అనే ఋషి ఉండేవాడు. ఆయన బ్రహ్మ తేజస్సంపన్నుడు. సాంగవేదాధ్యయనపరుడు. ఆయన ప్రసేనజిత్తు అనే రాజు కుమార్తె ఐన రేణుకను పెళ్ళాడాడు. వారికి రుమణ్వంతుడు, సుషేణుడు, వసు, విశ్వావసు, పరశురాముడు అని ఐదుగురు పుత్రులు కలిగారు.

ఒకరోజున రేణుక స్నానానికని నదికి వెళ్ళింది. ఆ సమయంలో సౌందర్యవంతుడైన గంధర్వుడొకడు ఆకాశమార్గాన పోతున్నాడు. అతడి ప్రతిబింబం నీటిలో కనపడగా, వచ్చినపని మరచి రేణుక చాలసేపు నదిఒడ్డునే ఉండి పోయింది. అందుచేత, ఆమె ఆశ్రమానికి చేరుకునేసరికి ఆలస్యమయింది.

ఈ ఆలస్యానికి కారణం దివ్యదృష్టివల్ల తెలుసుకొన్నాడు జమదగ్ని. క్రోధావేశంతో ఋషి రేణుకను బహువిధాల తూలనాడి, వెంటనే అక్కడ ఆశ్రమంలోనే వున్న కొడుకులు నలుగురనూ పిలిచాడు. 'ఇటువంటి మహాపాపి జీవించి ఉండటం తగదు. చంపివేయండి' అని ఆజ్ఞాపించాడు. ఐతే, తల్లియందుండే ప్రేమచేత వారు తండ్రి ఆజ్ఞను నెరవేర్చలేకపోయారు. జమదగ్ని వారిపైన కోపించి, 'మీరు ఈ వనమందు అజ్ఞానులై, మృగాలలాగ పక్షులలాగ చరించండి!' అని శపించివేశాడు.

కొంతసేపటికి పరశురాముడు ఆశ్రమానికి వచ్చాడు. అతనినికూడా తండ్రి అలానే ఆజ్ఞాపించాడు. తక్షణమే పరశురాముడు, తల్లి అని శంకించక, తల నరికివేశాడు. అప్పుడు జమదగ్ని సంతోషించి, శాంతించి, 'నాయనా, రామూ! నామాట జవదాటక, తెంపుచేసి దుష్టురాలైన నీ తల్లిని వధించావు. సంతోషించాను. నీ కిష్టమైన వరములు కోరుకో' మని అనేసరికి 'తండ్రీ!— అమ్మను బ్రతికించు. సోదరులకు జ్ఞానప్రాప్తి కలగజేయి. యుద్ధములందు నాకు అప్రతిహతశక్తిని ప్రసాదించు'—అని కోరుకొన్నాడు. జమదగ్ని ఆనందంతో కొడుకు అభీష్టాలను నేరవేర్చాడు.





# పోయిన గాలం

పూర్వం జపానులో హూరీ, హోదేరీ అని ఇద్దరు అన్నదమ్ములుండేవారు. హూరీ ప్రతిరోజూ సముద్రతీరానికి వెళ్ళి చేపలు పట్టేవాడు. హోదేరీ విల్లూ, బాణాలూ పట్టుకుని అడివికి పోయి జంతువులను వేటాడేవాడు. అన్నదిమ్ములిద్దరి తత్వాలలోనూ చాలా వ్యత్యాసం ఉండేది. హూరీ ఎప్పుడూ గంభీరంగా ఉండేవాడు, హోదేరీ సరదాగా ఉండేవాడు. అయినా ఇద్దరిమధ్యా గొప్ప ప్రేమ ఉండేది.

ఒకనాడు ఉదయం హోదేరీ అన్నతో ఈ విధంగా అన్నాడు:

"నువు రోజూ చేపలు పడతావు, నేను వేటకు పోతాను. ఇవాళ సరదాగా ఒక పని చేదాం. నువు నా విల్లు, బాణాలు తీసుకుని అడవికి వేటకువెళ్ళు. నేను నీ గాలం తీసుకుని సముద్రానికి చేపలు పట్టబోతాను. ఏం?"

ఈ ఆలోచన హూరీకి నచ్చలేదు. కాని తమ్ముడు మరీమరీ కోరగా సరేనని ఒప్పుకున్నాడు. ఆరోజు హూరీ వేటకు వెళ్లాడు, హోదేరీ చేపలు పట్టబోయాడు. సాయంకాలానికి ఒక్క జంతువునుకూడా కొట్టకుండా హూరీ ఇంటికి తిరిగివచ్చాడు. హోదేరీ ఒక్క చేపనైనా పట్టకపోగా గాలం పోగొట్టుకుని మరీ ఇలుచేరాడు.

"నేను వద్దని మొదటే చెప్పానా? నామాట విన్నావుకావు. నా గాలంకూడా సముద్రంపాలు చేశావు?" అన్నాడు హూరీ.

తనవల్ల పొరపాటు జరిగిందని హోదేరీ ఒప్పుకున్నాడు.

"ఆ గాలం పోతే పోయింది. నీకు నూరు గాలాలు చేయించి పెడతాను. కోప్పడకు," అన్నాడతను.

"నీ నూరు గాలాలు నాకవసరంలేదు అలవాటైన గాలం, అది లేకపోతే నాకు

కె. మురహరిరావు




చెయ్యి చచ్చినట్టుంటుంది," అన్నాడు హూరీ కోపంగా.

అన్న మాటలు సబబుగా లేనప్పటికీ, తప్పు తనదే గనక సముద్రంలో పడిపోయిన గాలాన్ని యెట్లాగైనా తీసుకు రావటానికి హెుదేరీ బయలుదేరాడు. సముద్రంలో తన ప్రాణం పోయినా సరేగాని, ఆ గాలం లేకుండా తిరిగి రానని అతను ఒట్టు పెట్టుకు మరీ బయలుదేరాడు.

సముద్రంలో ఒక గుట్టవద్ద గాలం పోయింది. హెుదేరీ ఆ గుట్టమీదినుంచి సముద్రంలోకి దూకేశాడు. ఎంత లోతుకు పోయినా అడుగు తగలలేదు. కొంతదూరం వెళ్ళాక నీళ్ళ అడుగున ఏదో మెరుస్తూ కనబడింది. అది ఒక భవనం. దానిచుట్టూ నాచుచెట్లు వంద అడుగులకుపైగా పెరిగి ఉద్యానవనం లాగున్నాయి. ఈ చెట్ల మధ్యని హెుదేరీ దిగి ఏంచెయ్యటానికీ తోచక చూస్తూ ఉండగా, అంత దూరాన ఉన్న భవనంలోనుంచి ఒక చక్కని అమ్మాయి బయటికి వచ్చి అతనికేసి నడిచి రాసాగింది.

ఆమె హెుదేరీని చూసి ఆశ్చర్యపడి ఆగి, "ఎవరు మీరు?" అన్నది.

హెుదేరీ తన కథ యావత్తూ ఆమెకు వివరంగా చెప్పాడు.

"అట్లాగా? అదే మాయిల్లు, నాతోరండి. మీరు పోగొట్టుకున్న గాలంకోసరం మా నాన్నగారు వెతికిస్తారు," అన్నదామె. హెుదేరీ ఆమెతోబాటు భవనంప్రవేశించాడు.

ఈ భవనం ముత్యపు చిప్పలతో, పగడాలవరసలతో, రత్నాలతో చాలా అందంగా ఉన్నది. అది సముద్రరాజు భవనం.

సముద్రరాజు హెుదేరీకి గొప్పగాస్వాగత మిచ్చి భోజనాలకు ఏర్పాట్లు చేయించాడు. భోజనాలయాక రాజు రకరకాల చేపలను పిలిచి, తన రాజ్యంలో ఉన్నవారందరినీ వెంటనే పిలుచుకు రమ్మని ఆజ్ఞాపించాడు.

త్వరలోనే జలచరులందరూ వచ్చారు. హొదేరి పోగొట్టుకున్న గాలం ఆచోకీ వారెవరూ ఎరగమన్నారు.

ఇంతలో రాజుగారి మంత్రి, "ప్రభూ! అందరూ వచ్చారుగాని, సొరచేపమ్మగారు రాలేదు. ఆమెకు గొంతునొప్పిగా ఉండి పడుకున్నారట. వైద్యుడికోసరం ఎదురు చూస్తున్నారని తెలిసింది," అని చెప్పాడు.

వెంటనే రాజవైద్యుణ్ణి సొరచేపమ్మగారి వద్దకు పంపారు. ఆయన చేపలగాలం ఒకటి చేతబుచ్చుకుని చక్కా వచ్చాడు. అది సొరచేపమ్మగారి అంగుట్లోనుంచి శస్త్ర చికిత్స చేసినమీదట బయటికి వచ్చింది.

"అదే నేను పోగొట్టుకున్న గాలం!" అన్నాడు హొదేరీ. అతను వచ్చిన పని పూర్తి అయింది.

కాని సముద్రరాజు కూతురికి హొదేరీ వెళ్ళిపోవటం ఏ మాత్రం ఇష్టం లేదు.

"మీరు ఇక్కడే ఉండిపోండి. మనిద్దరం పెళ్ళాడి సుఖంగా ఉందాం," అన్నదామె హొదేరీతో.

ఆమెను పెళ్ళాడాలని హొదేరీకికూడా ఉన్నది. కాని అతను అన్నను విడిచీ, తన వేటను విడిచీ ఉండలేడు.

"నువే నావెంట వచ్చెయ్యకూడదా ?" అన్నాడు హొదేరీ.



"నేనీ సముద్రం దాటివస్తే నారూపం మారిపోతుంది" అన్నదామె.

హెుదేరీ సముద్రరాజ్యంనుంచి తిరిగి ఇంటికి వచ్చేశాడు. హూరీకి గాలం ఇచ్చేశాడు. గాలం తిరిగి దొరికినందుకు కాదు కాని, తమ్ముడు ప్రాణాలతో కనిపించినందుకు హూరీ చాలా సంతోషించాడు. గాలంకోసం తమ్ముడిని అంతగట్టిగా కోప్పడినందుకు హూరీ చాలా నొచ్చుకున్నాడు.

హెుదేరీకి ఇప్పుడు వేటమీద ఆసక్తిలేదు. అతనికి అస్తమానమూ సముద్రరాజు కూతురే కనిపిస్తోంది. అతను రోజూ సముద్రతీరానికి వెళ్ళేవాడు. అందులో కదులుతూన్న అలలకేసి చూస్తూ, నిట్టూర్చేవాడు.

ఒకనాడు హెుదేరీ సముద్రతీరాన నడుస్తూండగా సముద్రంలో పెద్ద పెద్ద అలలు రాసాగాయి. గాలి వీచింది. తుఫాను లేచింది. ఈ తుఫానులో సముద్రరాజు కూతురు నీళ్ళపైకి తేలింది. ఆశ్చర్యపోయి హెుదేరీ చూస్తూ నిలబడ్డాడు. కాసేపటికల్లా ఆమె హెుదేరివద్దకు వచ్చింది.

హెుదేరీ ఆనందానికి మేరలేదు. అతను ఆమెను తన అన్నవద్దకు తీసుకుపోయాడు. హూరీ ఎంతో సంతోషించి వారిద్దరికీ పెళ్ళి చేశాడు. మూడు రోజులు ముగ్గురూ చాలా సరదాగా తిరిగారు.

మూడోరోజు సాయంకాలం వాళ్ళు సముద్రతీరానికి షికారువెళ్ళారు. సూర్యాస్తమయం కాబోయే సమయంలో హెుదేరీ భార్యలో చిత్రమైన మార్పు వచ్చేసింది. చూస్తుండగానే ఆమె పంచవన్నెల చేపగా మారిపోయి, ఒక్క ఎగురున వెళ్ళి సముద్రంలో పడి కనబడకుండా మునిగిపోయింది.

ఆ తరవాత హెుదేరీ రోజూ సముద్రతీరానికి వెళ్ళేవాడు. కాని ఆమెను ఎన్నడూ తిరిగి చూడలేకపోయాడు.





# వరహాల మూట

పూర్వకాలమందు, బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధి సత్త్వుడు ఒక గొప్ప భూస్వామికి కుమారుడుగా జన్మించాడు. అతడు పెరిగి పెద్దవాడయ్యేసరికి ఆ కుటుంబం ఐశ్వర్యంతో తులతూగుతూ వుండేది. బోధి సత్త్వుడికి ఒక తమ్ముడుకూడా వున్నాడు.

ఇలావుండగా, కొంతకాలానికి ఆ తండ్రి కాలంచేశాడు. అందుచేత, కుటుంబ వ్యవహారాలు చక్కబెట్టుకువద్దామని చెప్పి అన్నదమ్ములిద్దరూ, వాళ్ళకు చెందినటువంటి ఒక పల్లెటూరుకు వెళ్లారు. అక్కడ ధాన్యం వగైరా వసూలుద్వారా వాళ్ళకు ఒక వెయ్యివరహాల నగదు రైతులవద్ద నుంచి లభ్యమయింది.

ఈ నగదు చేతపట్టుకొని, సోదరులు మళ్ళీ కాశీనగరానికి బయల్దేరారు. దారిలో వారు ఒక నది దాటవలసి ఉన్నది. పడవ వాడు రావడానికి ఇంకా వ్యవధి ఉండటం చేత, వాళ్ళు వెంట తెచ్చుకొన్న ఫలాహారం మూట విప్పి, తిని, ఇన్ని మంచినీళ్ళు తాగారు. బోధిసత్త్వుడు తన భాగంలో కొంచెం మిగిల్చి, అలవాటుచొప్పున, నది లోకి విసిరాడు.

బోధిసత్త్వుడు విసిరిన ఫలాహారాన్ని నదిలో వుండే జలభూతం అందుకొన్నది. ఆ ఫలాహారాన్ని అది సంతోషంతో ఆరగించగానే దానికి ఒక దివ్యమైన శక్తి కలిగింది. ఆ శక్తివల్ల అది ఫలాహారాన్నిగురించిన సంగతి సందర్భాలన్నీ తెలుసుకోగలిగింది. ఈ విధంగా తనకు మేలుచేసినవారెవరైందీ గుర్తించింది. యిక బోధిసత్త్వుడు ఆకలి తీరటంతో అక్కడనే నది ఒడ్డున ఇసుక మీద పైమీదిబట్ట పరుచుకొని పడుకొన్నాడు.

తమ్ముడిది దొంగ గుణం. అన్నవద్ద ఉన్న వెయ్యి వరహాల సొమ్ము ఎలాగైనా



కాజేసి, దాచుకోవాలని వాడికి బుద్ధి పుట్టింది. ఆ వెంటనే గొప్ప యుక్తి ఒకటి చేశాడు. సొమ్ముకట్టిన మూటవంటిదే సరీగా మరివక మూట రాళ్లతో నింపి తయారుచేశాడు. రెండుమూటలూ అన్నకు కనబడకుండా దాచాడు.

తరువాత పడవవాడు రాగానే బోధిసత్త్వుడు మేల్కొన్నాడు. అన్నదమ్ములిద్దరూ పడవ ఎక్కారు. పడవ సరీగా నదిమధ్యకు వచ్చింది. తను చేసిన యుక్తి ప్రకారం చిన్నవాడు మూటల్లో ఒకదానిని నదిలో జారవిడవదలిచాడు. చేసేది దొంగ పని కనక—వణికిపోతూ సరిగా చూడకుండానే ఆ రెండు మూటల్లో ఒకదానిని నదిలోకి జారవిడిచాడు. అలా జారవిడిచిన వెంటనే గంతులువేస్తూ—

"అయ్యో, అయ్యో!—అన్నయ్యా, వరహాలమూట కాస్తా నదిలో పడిపోయింది!" అంటూ గోలగా అరిచాడు.

ఈ మాటకు అన్న 'పోనీలే తమ్ముడూ, ఏంచేస్తాం? మన సొమ్ముకాదది; అందుకనే పోయింది. దీనికోసమని విచారపడటంవల్ల లాభమేముంది?' అని చిన్నవాడిని సముదాయించాడు.

బోధిసత్త్వుడు విసిరిన ఫలాహారం ఆరగించిందికదా జలభూతం? దానికి ఆవెంటనే అపూర్వమైన దివ్యశక్తికూడా కలిగిందికదా! అప్పటినుంచీ అది బోధిసత్త్వుడికి ఏవిధంగా సహాయంచేసి తన ఋణం తీర్చుకోగలనా అని ఆత్రంతో కనిపెట్టుకొనే ఉన్నది.

ఇప్పుడు మూట నీళ్లలో పడగానే, అది వరహాలమూట అని, జలభూతానికి తెలిసిపోయింది. తమ్ముడు తలపెట్టిన దుష్టవ్యూహంకూడా అది గ్రహించింది. వెంటనే ఆ జలభూతం పెద్దనోరు గల ఒక చేపను పంపించి ఆ మూట మింగమన్నది. ఆ చేప ఆ విధంగానే మూటను మింగింది.

మూట మింగినప్పటినించీ ఆ చేపను, తన కను గప్పి ఎక్కడికీ తప్పించుక పారి పోకుండా జాగర్తగా కనిపెట్టి చూస్తూనే వుంది జలభూతం.

ఒకటి రెండు రోజులకు బోధిసత్వుడూ, అతడి తమ్ముడూ కాశీనగరానికి తిరిగి వచ్చారు. బోధిసత్వుడు మాత్రం ధనం ఉన్న మూట నదిలో పడిపోవటాన్ని గురించిన సంగతే దాదాపు మరిచిపోయాడు. తమ్ముడిలాగా అతడు ధనాశపరుడు కాదు.

ఇంటికి చేరుకోగానే చిన్నవాడు, అన్నను మోసగించానుకదా అనే సంతోషంతో, తన వద్ద ఉన్న రెండవ మూట విప్పిచూచాడు ఆత్రంగా. తీరా చూస్తే ఏముంది? తను మూటకట్టిన రాళ్ళే అవి! మరేమీ కాన రాలేదు!! తనుచేసిన పొరపాటు గ్రహించాడు. దానితో గుండె పగిలినట్టయి చిన్న వాడు అలానే విచారంతో కృంగిపోసాగాడు. అది కాలక్రమాన దీర్ఘవ్యాధిగా మారింది. మంచం పట్టాడు.

పోతే—ఒకరోజున జాలరివాళ్ళు చేపల కోసం నదిలో వలలువేశారు. జలభూతం తన శక్తివల్ల, మూటను మింగిన ఆ చేప వాళ్ళ వలలో పడేటట్టు చేసింది. బెస్తవాళ్లు ఆ చేపను పట్టి పట్టణానికి తీసుకపోయారు.




'దీని ఖరీదెంత?' అంటూ అందరూ వాళ్లను అడుగుతూ వచ్చారు.

'వెయ్యి వరహాలూ, పైన ఒక వరహా' అని వాళ్ళు జవాబు చెప్పసాగారు.

బెస్తవాళ్ళను చూచి అందరూ—'అబ్బా! ఈ మత్స్యం ఖరీదు వెయ్యి వరహాలట! అది చాలక పైగా ఇంకొక వరహాకూడా కావాలట!! ఏ కాలంలోనూ కని విని ఎరుగమే యీ వింత!' అంటూ గేలిచేయ సాగారు.

బెస్తవాళ్లు ఆ చేపను తిన్నగా బోధి సత్వుని యింటివద్దకు తీసుకవెళ్లి, దానిని అతనికి అమ్మజూపారు.






కొన్నాడు. తనూ భార్యా కలిసి ఆ చేపను కోసేసరికి, వారికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. చేపపొట్టలో ఒక మూట ఉన్నది! అందులో సరిగా వెయ్యి వరహాలున్నాయి!! చూడగా, ఆ మూట తను కట్టినదే!!!

అప్పుడు బోధిసత్వుడు భార్యతో జరిగిన దంతా ఇలా చెప్పాడు :—

'ఈ వరహాలమూట మనదే. నేను మన ఊరి రైతులనుంచి డబ్బు వసూలుచేసి తెస్తున్నప్పుడు పొరపాటున నదిలో పడి పోయివుంటుంది. అది మింగిన చేప ఈ బెస్తలకు దొరికింది. బాగా నేవుంది. అయితే—ఈ బెస్తలు సామాన్యులు కారు. దివ్యజ్ఞానం కలవాళ్ళలా కనబడుతున్నారు. ఏమంటే, వెయ్యివరహాలు విలువగల ఈ మూట చేపపొట్టలో ఉన్నట్టూ, అది నాదే ఐనట్టూ వాళ్ళకు స్పష్టంగా తెలుసు. అందు కనే, అందరకూ వాళ్ళు దానివెల 'వెయ్యి వరహాలూ—పైన ఒకవరహా' అని చెబుతూ వచ్చారు. నాకుమాత్రం ఒక్క వరహాయే అని చెప్పారు. పైన కోరే ఈ ఒక్కవరహా వాళ్లశ్రమకు ఫలితం అన్నమాట.

'ఈ సొమ్ము నాది అని తెలియటంచేతనే, నాసొమ్ము నాకు చెందచేసి వాళ్ళ కూలీ డబ్బులు వాళ్ళు పట్టుకపోయారు. వాళ్ళు

"ఖరీదెంత?" అని అడిగాడు బోధి సత్వుడు.

"మీకైతే ఒక్క వరహా!" అని వాళ్ళు బదులు చెప్పారు.

"అందరకూ ఎంత వెల చెబు తున్నారు?" అని మళ్ళీ అడిగాడు బోధి సత్వుడు ఆశ్చర్యపడి.

"మరెవళ్ళకైనా అయితే వెయ్యి వర హాలు, పైన ఒక వరహా తీసుకొంటాం. మీకుమాత్రం ఒక్క వరహాయే!" అని చెప్పారు బెస్తలు.

వెంటనే బోధిసత్వుడు ఒక వరహా చెల్లించి, బెస్తలవద్దనుంచి ఆ చేపను

చేసిన పని ఎంత యుక్తియుక్తంగా వున్నది! కాని, చేపను బేరంచేసిన జనసామాన్యానికి ఈ అంతరార్థం అంతా ఏంతెలుసు? అందు కనే వాళ్ళు వికటంగా నవ్వేసి వెళ్ళి పోయారు,' అని చెప్పి, బెస్తవాళ్లకు ఇంతటి గొప్పశక్తి ఎలా అలవడిందా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఆలోచిస్తూవున్న బోధిసత్వుడికి వినపడే లాగ ఒక దివ్యవాణి ఇలా పలికింది: 'మహానుభావా!—నేను నదిలో నివసించే జలభూతాన్ని. ఆనాడు ఊరినుండి వస్తూ, నదిగట్టుమీద నీవు ఫలహారం చేయగా మిగిలినదానిని భూతతృప్తికోసం గంగలో పడవేశావు. జ్ఞాపకముందా? ఆ ప్రసాదం ఆరగించగానే నాకు అపూర్వమైన దివ్య శక్తి కలిగింది. దానివల్లనే నీ చరిత్ర అంతా ఎప్పటికప్పుడు తెలుసుకోగలుగుతున్నాను.

'నీటిలో పడిన నీ వరహాలమూటను చేప చేత మింగించింది నేనే. బెస్తలను ప్రోత్స హించి ఆ చేపను నీవద్దకు పంపింది నేనే. నీవు నాకు ప్రసాదం పెట్టినందుకు ఫలి తంగా నీ సొమ్ముమూటను జాగ్రత్తపెట్టి, నీకు వప్పగించి నా ఋణం తీర్చుకొగలి గాను. నీ సొమ్ము నీవు తీసుకో. కాని దీనిలో ఒక్క పైసా అయినా నీ తమ్ముడికి మాత్రం ఇవ్వవద్దు సుమా!' అని హెచ్చ రిస్తూ, తమ్ముడు చేసిన ద్రోహమూ, దొంగ తనమూ అంతా వెల్లడించింది జలభూతం.

జలభూతం చేసిన ఉపకారానికీ, చెప్పిన హితవుకీ బోధిసత్వుడు చాలా మెచ్చు కొన్నాడు. ఐతే, తన తమ్ముడి విషయంలో మట్టుకు దాని మాట పాటించలేదు. తమ్ముడు దొంగ అని తెలిసినప్పటికీ, ఆ సంగతినే మనసుకు పట్టించుకోలేదు. అంతేకాదు. సోదరన్యాయాన్ని అనుసరించి, చిన్నవాడికి తన సొమ్ములో సగం—అనగా ఐదువందల వరహాలూ ఇచ్చి, బోధిసత్వుడు తన సోదరప్రేమను వ్యక్తపరిచాడు.






# పూజారి మాయ

కోశాంబినగరంలో చాలాకాలంకిందట ఒక శ్రీమంతుడికి ఇద్దరు కొడుకులు. ఇద్దరూ సోమరులు. వాళ్లు సోమరులుగా ఉండటం చూచి తండ్రికి చాలా విచారం కలిగింది. చేతికి ధనం ఇస్తే ఇంకా చెడిపోతారని తలచి, వాళ్లకు డబ్బు చిక్కనివ్వలేదు.

మరికొద్దికాలానికే ఆ శ్రీమంతుడు జబ్బు పడి, ఇక బతకనని తెలుసుకొన్నాడు. ఆయనకు నమ్మకస్థుడైనవాడు ఆ వూరి శివాలయం పూజారి ఒక్కడు మాత్రమే. ఆ పూజారికి కబురుపంపించి, రహస్యంగా ఒక తాళంచెవి ఇచ్చాడు.

'ఈ తాళంచెవి నీవద్ద జాగర్తగా ఉంచు. నా తదనంతరం నా కొడుకులలో ఎవడైనా వచ్చి అడిగితే ఇవ్వు' అని చెప్పాడు.

పూజారిని సాగనంపినతరువాత ఆయన భార్యను పిలిచి ఒక పత్రం చేతికిచ్చాడు. 'మన కుర్రవాళ్ళు సోమరితనం వదిలి శ్రమపడటానికి సిద్ధపడితే—అప్పుడు దీనిని వాళ్లకు ఇవ్వు, అంతవరకూ జాగ్రతగా వుంచు,' అని చెప్పాడు. ఆ తరవాత కొద్ది రోజులలో ఆయన మరణించాడు.

తండ్రిపోయినతరువాత కొడుకులిద్దరూ కొంతకాలం అల్లరిచిల్లరగా తిరిగారు. తల్లిని పీడించి ఇంట్లో ఉన్న డబ్బంతా తీసుకుపోయి ఖర్చుపెట్టేశారు. క్రమంగా ఇంట్లో ఉన్న వస్తుసామగ్రీ, పాత్రసామగ్రీకూడా ఖర్చయిపోయింది. వీరిని చూసి తల్లి ఎంతో విచారించింది. కాని వారి బుద్ధి మారకపోవటంవల్ల చూస్తూ ఊరుకోవలిసి వచ్చింది.

చివరకు అన్నదమ్ములకు తిండిలేని పరిస్థితికూడా వచ్చింది. ఎవరూ వారికి అప్పిచ్చేవారుకూడా లేరు. ఆ స్థితిలో చిన్నవాడు ఒకనాడు తల్లితో, "అమ్మా, నాకు బుద్ధివచ్చింది. ఇక ఎక్కడైనా కాయకష్టం

ఎస్. వెంకటకృష్ణయ్య

చేసుకుని బతుకుతాను," అన్నాడు. ఈ మాట విని తల్లి సంతోషించింది. తన భర్త తనకిచ్చిన పత్రం వాడికి చూపింది.

చిన్నవాడు ఆ పత్రం విప్పి చూసు కుంటే అందులో ఇలా ఉన్నది :

"నా ధనమంతా మన ఇంటికి ఈశాన్య దిక్కున ఉండే మర్రిచెట్టుదగ్గిరి పాడు గుడిలో పాతిపెట్టాను. ఆ ధనం పెట్టె తాళంచెవి మనవూరి శివాలయం పూజారి వద్ద ఉన్నది. తీసుకొని సుఖపడండి!"



ఆ పత్రం చదువుకున్నవెంటనే చిన్న వాడు చాలా సంతోషించాడు. కాయ కష్టం చెయ్యకుండానే డబ్బు వస్తున్నది. ఈ డబ్బంతా తానే కాజెయ్యాలని వాడికి దుర్బుద్ధి పుట్టింది. పూజారివద్దకు పోయి తాళంచెవి అడిగి పుచ్చుకొన్నాడు. చీకటి పడిన తరువాత గునపం పట్టుకొని గుడి వద్దకు వెళ్లాడు. తలుపుతెరచి లోన ప్రవే శించేసరికల్లా అతడి వీపుపైన ఎవరో గ్రుద్ది నట్టయింది! అది దయ్యమనుకొని చిన్న వాడు భయపడి, అక్కడినించి పారి పోయాడు. నిరాశతో తాళంచెవి పూజారికి తిరిగి ఇచ్చివేశాడు.

మరునాడు వాడు తల్లి ఇచ్చిన పత్రాన్ని ఏమీ ఎరుగనట్టు అన్నకు చూపించాడు. అన్న దానిని చదువుకొని, 'తమ్ముడూ!— నేను గుడివద్ద కాచుకొనివుంటాను. మనం అక్కడినుండి ధనం తెచ్చేటప్పుడు తగు జాగ్రత్తలో వుండాలికదా? కనుక, నీవు పట్నంపోయి మంచి కత్తి ఒకటి కొనుక్కురా. ఎందుకైనా మంచిది,' అని చెప్పి పంపాడు.

ఆ తరవాత అన్న పోయి పూజారివద్ద తాళంచెవి తీసుకొన్నాడు. చీకటి పడనిచ్చి గుడి తలుపులు తెరవగానే వాడి వీపుమీద కూడా ఒక గ్రుద్దు పడింది! వాడూ దయ్య మనుకొని భయపడి,బయటికిపారిపోయాడు. కొంచెంసేపటిలో తమ్ముడు కత్తిపట్టుకుని అక్కడికి వచ్చాడు.

ఒకరికి యిద్దరు కావటంతో వాళ్లకు కాస్త ధైర్యం చిక్కింది. 'కత్తికూడా వున్నదాయె! ఇంక భయమేమిటి?' అనుకొన్నారు వాళ్ళు. ఐనా దయ్యమున్నదనే జంకుమాత్రం మనసులోవున్నది. ఇద్దరూ కలిసి గుడి తలుపులు తెరిచి లోపల ప్రవేశించారు. ఈసారికూడా ఇద్దరి వీపులమీదా రెండు గ్రుద్దులు పడినై. చిన్నవాడు, తన చేతనున్న కత్తిని భయపడుతూనే ఆ చీకటిలో వెనకకు విసిరాడు.

అవెంటనే 'కెవ్వు' మని కేక వినిపించి ఎవరో పారిపోతున్నట్టు శబ్దం అయింది.

దయ్యం పారిపోయిందని వాళ్ళు సంతోషించారు. తరువాత తవ్వితే అక్కడ ఒక పెట్టె కనబడింది. దానిలో ధనం వుంటుందని ఆశించిన ఆ సోదరులకు తండ్రి దస్తూరితోవున్న ఒక పత్రం మాత్రం దొరికింది. దానిని ఇంటికి తెచ్చి చూడగా, కోశాంబి నగరానికి సమీపంలోనే ఒక వంద ఎకరాల భూమి కొడుకులిద్దరిపేర చెరిసగం రాయబడినటువుంది.

దానిని వారు తండ్రికి నమ్మకస్తుడనే గౌరవంతో పూజారి ఇంటికి తీసుకొనివెళ్లి చూపారు. ఆ సమయాన పూజారి చేతికి కట్టుకట్టుకొని ఉన్నాడు. అదేమని వాళ్ళు అడిగితే 'ఇది నా ద్రోహానికి తగిన శాస్తి' అని అంటూ, వాళ్లు గుడిలో ప్రవేశించినప్పుడల్లా తను వెనకనే వెళ్లి వాళ్ళని వీపుపైన గ్రుద్ది భయపెట్టిన సంగతి వెల్లడించాడు. అంతేకాదు. పత్రంచూచి, 'అబ్బాయిలూ!—నేనూ మీలాగే ఆ పెట్టెలో ధనం ఉంటుందని ఆశించానుకాని, ఇలాంటి పత్రం వుంటుందని అనుకోలేదు. నిజానికి ఈ పత్రం నాకు పనికేరాదు. మీ తండ్రి చాలా బుద్ధికుశలుడు' అని చెప్పాడు.

అప్పుడు తండ్రి వుద్దేశం వారికి అర్థమైంది. శ్రమపడి ఆ భూమి పండించుకొని వాళ్ళు సుఖించారు.





9

[చతుర్నేత్రుడూ, సమరసేనుడూ సంభాషిస్తున్నప్పుడు, చాటునవుండి వింటూన్న అటవికులను నరవానరం, నల్లగూబా వెంటాడినైగదా? తరవాత సమరసేనుడు ధనరాసులతో ఉన్న నావా, కాపలాకాస్తున్న నాగకన్య వృత్తాంతం అడిగాడు. శమనద్వీపరాజైన శాక్తేయుడిని చండీదేవి కోరిన కోర్కె సంగతి చతుర్నేత్రుడు తెలియబరిచాడు. తరువాత—]

చతుర్నేత్రుడు చెప్పుకు పోతూన్న కథ వింటూన్న సమరసేనుడికి చాలా అబ్బురపాటు కలిగింది. చండీదేవి తన దేవాలయాన్ని మట్టితో, రాతితోకాక వెండీ బంగారాలతో నిర్మించవలసిందని అజ్ఞాపించటం చాలా వింతగా కనబడింది.

దేవాలయాలను వెండీ బంగారాలతో నిర్మించటం మానవమాత్రులకు సాధ్యమయే పనికాదుగదా!

"చతుర్నేత్రా! చండీదేవి అటువంటి దుస్సాధ్యమైన పని తన భక్తుణ్ణి సాధించమనటం నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు సమరసేనుడు.

చతుర్నేత్రుడు తలవూపుతూ బిగ్గరగా నవ్వాడు.

"సమరసేనా! నీకు శక్తి ఉపాసన అంటే ఏమిటో తెలియదు. ఇహలోక సుఖాలనూ, తోటి మానవులమీద అధికారాన్నీ కాంక్షించేవారే, యిలాంటి శక్తి ఉపాసకులవుతారు. దేవి వాళ్ళను కరుణించి ఆ శక్తులు ప్రసాదించేముందు, వాళ్ళ ధైర్య సాహసాలనేకాక, తనమీది భక్తి బలాన్ని




కూడా పరీక్షిస్తుంది. మా రాజయిన శాక్తేయుణ్ణికూడా చండీదేవి యిలాంటి కఠిన పరీక్షకే గురిచేసింది."

"అయితే అంత వెండీ బంగారాలను సాధించగలిగాడా?" అని అడిగాడు సమరసేనుడు. అందుకు చతుర్నేత్రుడు—

"అదే నేను చెప్పబోతున్న కథ. ఆ ధనరాసులతో నిండివున్న నావా, దాన్ని కాపలా కాస్తున్న నాగకన్య వృత్తాంతమంతా యిందులోనే ఇమిడివున్నది. నేనూ, ఏకాకి మాంత్రికుడు కూడా యింత బద్ధ శత్రువులంకావటానికి కారణాలు కూడా వివరిస్తాను. ఇంతకూ మూలం; ఆ శమనద్వీపం



లోని చండీదేవి కోరినకోరికా, దానికి శాక్తేయుడు తల వూపటమూనూ.

సరే, శాక్తేయుడు దేవికోర్కెను నెరవేర్చాలని నిశ్చయించుకున్నాడు. ఒక విధంగా చూస్తే, ఆది కోర్కె అనేకన్న దేవి ఆజ్ఞగానే భావించాలి. శాక్తేయుడు అంత వెండీ బంగారం సంపాయించాలంటే, మీ మాదిరిగానే పర రాజ్యాలమీదికి దాడి వెడలటంకన్న మరో మార్గం లేదుకదా?

ఇక శాక్తేయుడు సైనికులకోసం దేశం నలుమూలలా గాలించసాగాడు. మంచి దేహబలం ధైర్యసాహసాలూగల యువకుల్ని వీరి సైన్యంలో చేర్చుకో ప్రారంభించాడు. ఒక్కొ గ్రామం వెళ్ళటం, అక్కడవున్న యువకు లందరినీ పోగుచేసి, మల్లయుద్ధం, కత్తి, కర్రసాముల్లో పోటీలు పెట్టేవాడు. ఇలాంటి పోటీల్లో నెగ్గిన కొద్దిమందిని మాత్రమే సైనికులుగా స్వీకరించేవాడు.

శాక్తేయుడు యీవిధంగా సైనికుల్ని సమాయత్త పరిచేనాటికి నేను యిరవైఏళ్ల ప్రాయంగల యువకుణ్ణి. ఈ ఏకాకికూడా నా వయసువాడే కాక, నేను వుండే పల్లెలోనే వుండేవాడు.

పోతే, యిక్కడ ఏకాకికీ నాకూ వున్న బాల్యవిరోధం సంగతి చెప్పక తప్పదు.



బాల్యంలో కలిగిన ఆ శత్రుభావమే అనేక దుశ్చర్యలకు దారితీసి, చివరకు యీ ద్వీపం మానవవాసయోగ్యం కాకుండా చేసింది. ఆనాటికి ఏకాకి నిజంగా ఏకాకి కాదు. యీ ద్వీపం చేరినతరవాతే నా బంటు ఉలూకుడివల్ల ఆ ఏకాకితనం ప్రాప్తించింది.

ఏకాకీ నేనూ ఒకే పల్లెవాసులం అని చెప్పానుగదా? ఆ పల్లెలో మా యిద్దరి యిళ్ళూ యిరుగుపొరుగులనే వుండేవి. అందుచేతనే మాలో మొదటినించీ స్నేహభావంకన్న, శత్రుభావమే ఎక్కువపాలు వుండేది. కాని అది యింత తీవ్రదశకు రావటానికి చాలాకాలం పట్టింది.

నేనూ, ఏకాకికూడా మా ఆరవ ఏటి నుంచి పశులకాపరులుగా జీవితం ప్రారంభించాం. మా పల్లెపెద్ద అయిన పతంగుడి మేకలను అడవిలో మేపుకు రావటం మా పని. అప్పటికి మేము చాలా చిన్నవాళ్ళం కావటంవల్ల అడవిలో వేటాడటానికి మాకు అర్హతలేదు. వయసువచ్చినవాళ్ళూ, దృఢకాయులూ మాత్రమే వేటకు వెళ్ళేవారు.

ఒకనాడు నేనూ, ఏకాకీ మరికొందరు కుర్రవాళ్ళం మేకలను అడవికి తోలుకుపోయాం. ఆ ప్రాంతమంతా చాలా దట్టమైన చెట్లతో క్రిక్కిరిసి వుంటుంది. పైగా అది పెద్దపులులకూ, సింహాలకే కాక, ప్రతి








క్రూరమృగానికి ఉనికి. అయినా పశువులను మేపేందుకు అంతకన్న మంచి ప్రదేశం మా పల్లెప్రాంతాల్లో లేదు.

మేకలను దూరంగా వదిలి, కాపరుల మందరమూ ఒక చెట్టుకింద కూర్చున్నాం. వున్నట్టుండి ఒక అందమైన లేడిపిల్ల నాకు సంబంధించిన మేకలవద్దకు వచ్చి అరవ సాగింది. బహుశా అది తన తల్లినుంచి వేరుపడి యిలా వచ్చివుంటుంది.

ఆ లేడిపిల్లను చూడగానే దాన్ని పట్టుకుని మచ్చిక చేయాలనిపించింది. లేచి ఒక్క గంతులో అక్కడికి వెళ్ళాను. యీలోపల ఏకాకీకూడా ఆ లేడిపిల్లను చూచాడు. "ముందు నేను చూచాను, ఆ లేడిపిల్ల నాదే!" అంటూ నా వెనకనే పరిగెత్తుకుంటూ వచ్చాడు.

నేనుమాత్రం ముందువెళ్ళి ఆ పిల్లను పట్టుకున్నాను. నా దగ్గిరవున్న తాడును దాని మెడకు తగిలించి లాక్కురా ప్రయత్నిస్తున్నాను. యింతలో ఏకాకి నన్ను సమీపించి, లేడిపిల్ల నాది అంటూ నామీద కలియబడ్డాడు. నేను పట్టరాని రోషం వచ్చి అక్కడవున్న ఒక పెద్దరాతిని ఎత్తి అతడి తలమీద కొట్టాను. అరుస్తూ ఏకాకి కింద పడిపోయాడు.

ఈలోపల లేడిపిల్ల మెడకువున్న తాడుతో పారిపోసాగింది. నేను వెంటపడ్డాను. చెట్లల్లో తుప్పల్లో పరిగెత్తి పరిగెత్తి ఆఖరికి ఎలాఅయితేనేం దాన్ని పట్టుకున్నాను. అప్పటికే నేను బాగా అలసిపోయివున్నాను. లేడిపిల్ల నానుంచి పారిపోయేందుకు గుంజుకోసాగింది. నేనూ పట్టువదలకుండా వుండేందుకు పెనగులాడుతున్నాను.

ఆ పరిస్థితుల్లో నా గుండెలు అవిసేలా సింహగర్జన వినబడింది. అదీచాలా సమీపం నుంచే. నేను ఒక్క గంతులో లేడిపిల్లను దాపులనున్న ఒక చెట్టుకు కట్టివేసి, చెట్టు కొమ్మలలోకి ఎగబాకాను.





అక్కడ కాస్త స్థిమితం చిక్కినతరవాత గాని నేను చేసిన పొరపాటు నాకు అర్థం కాలేదు. చెట్టుకు కట్టివేయబడిన లేడిపిల్ల మెడతాడు గుంజుకుంటూ అరవసాగింది. ఒకవేళ సింహం దూరంగా పోతూవున్నా యీ అరుపు విని తప్పక ఆ ప్రదేశానికి వస్తుందని నాకు భయంకలిగింది. ఒకటి రెండు నిమిషాల్లో సింహం అక్కడికి రానేవచ్చింది.

చెట్లకొమ్మల్లో కూర్చున్న నాకు ప్రాణభయంలేదు. కాని కిందవున్న లేడిపిల్లమీదికి సింహం లంఘించింది. ప్రాణభయంతో అరుస్తూన్న లేడిపిల్లను చూచి నేను వూరుకోలేకపోయాను. చెట్టున ఎండివున్న ఒక కొమ్మ విరిచి సింహంమీదికి విసిరాను. అదీ పెద్ద పొరపాటే- అప్పుడే సింహం తలఎత్తి నన్ను చూచింది.

సింహం ముందు లేడిపిల్లను చంపి తినగలిగినంత తిన్నది. అలా తింటూనే మధ్య మధ్య తల ఎత్తి నావంక చూడసాగింది. చివరకు చెట్టుమీదవున్న నన్ను పట్టాలని పైకి ఎగిరింది. నేను దానికి అందకుండా మరికాస్త పైకి పోయాను.

అయినా సింహం తనప్రయత్నాన్ని మానలేదు. సూర్యాస్తమయం అయేవరకు అది చెట్టుకిందనే కాపలావేసి కూర్చున్నది.







ఆ రాత్రి నాకు కునుకు పట్టలేదు. తెల్లవారికూడా నేను చెట్టుమీదినుంచి దిగటానికి జంకుపుట్టింది. సింహం చెట్టుకింద లేకపోయినా ఆ ప్రాంతాల్లోనే తిరుగుతూ వుంటుందని నాకు తెలుసు. అప్పుడప్పుడూ దాని గర్జన వినపడుతూకూడా వున్నది.

ఆ రోజు మిట్టమధ్యాహ్నం అయేసరికి నా కర్ణపుటాలు బద్దలయేలా తప్పెటల మోత వినబడింది. అది మా పల్లెవాసులు నాకోసం వెతికేందుకు బయలుదేరారన్న దానికి సూచన! నాతోటి పశులకాపరులు నేను అడవిలోనుంచి తిరిగిరాలేదని పల్లెలో తెలియబరచివుంటారు.

తప్పెటల మోత క్రమంగా సమీపించసాగింది. ఇక చెట్టు దిగి వాళ్లకు ఎదురు వెళ్దామనుకున్నానుగాని నాకు గుండెధైర్యం లేకపోయింది. నిన్నటి సింహం యింకా ఆ ప్రాంతాన కాపలావేసివుంటుందన్న అనుమానం నాకు వదలలేదు.

బరిశెలూ, యీటెలూ ధరించిన ఒక నలభై యాభై మంది మా పల్లెవాసులు అడవి మార్మోగేలా అరుస్తూ వస్తున్నారు. కొందరు తప్పెటలు వాయిస్తున్నారు. అందరూ సరిగా నేను ఉన్న చెట్టుకు ఒక యాభైగజాల దూరంలోకి వచ్చారు.

సింహాన్నిగురించి నేను అనుమానించినది నిజమేఅయింది. పొదలమాటున దాగివున్న సింహం హఠాత్తుగా వాళ్ళమీదకు లంఘించింది. ఇలాంటిది సంభవమే అని తగుజాగర్తతో వస్తున్నారు మా పల్లెవాసులు.

సింహం మీదికి దూకినా వాళ్లు పారిపోలేదు. దృఢకాయుడైన ఒక యువకుడు సింహం పంజాదెబ్బను తన చేతులోవున్న పొడవాటి కొయ్యడాలుతో కాచుకున్నాడు. అదేసమయంలో మరిఒకయువకుడు వెనుకనుంచి దాని తోకను వడిసి పట్టుకొన్నాడు.

సింహం గర్జిస్తూ వెనుకకు తిరుగబోయింది. ఇంతలో మొదటి యువకుడు





తన చేతనున్న బరిసెతో దాని మెడమీద బలంగా పొడిచాడు. దెబ్బతిన్న సింహం అరుస్తూ మళ్ళీ ముందుకు దూకపోయే సరికి, తోక పట్టుకొనివున్న యువకుడు తన దగ్గిరవున్న చిన్నకత్తితో వెనుకనుంచి దాని వెన్నుమీద పొడిచాడు.

సింహం బాగా గాయపడిపోయింది. ఆ యువకులిద్దరూ చేరి దాన్ని తమచేతనున్న ఆయుధాలతో ఎడా పెడా పొడిచారు. సింహం నేలకు ఒరిగిపోయింది. చెట్టు కొమ్మల్లో వుండి యిదంతా పరికిస్తున్న నాకు పట్టరాని సంతోషం కలిగింది. గబగబ చెట్టు దిగుతూ పెద్దగా కేకపెట్టాను.

ఆ క్షణంలో జరిగిన వింత కళ్ళారా చూసిన నేనే నమ్మలేకపోయానంటే, లోకంలో ఎవరూ నమ్మరు. నేను అలా కేకపెట్టేసరికి అందరి దృష్టీ ఒక్కసారిగా నామీద లగ్నమైంది. మరుక్షణంలోకే తప్పెటవాయిస్తూ ముందువున్న ఏకాకి 'దయ్యం, దయ్యం' అంటూ పరిగెత్త సాగాడు. కన్నుమూసి తెరిచేఅంతలో అంత మంది జనం 'దయ్యం, దయ్యం,' అంటూ పరుగు లంకించుకున్నారు."

"ఇది చాలా చిత్రంగావుంది! మిమ్మల్ని చూసి అంతమంది పెద్దవాళ్ళుకూడా దయ్యం అని ఎందుకు పరిగెత్తటం సంభవించింది?" అని అడిగాడు సమరసేనుడు.

అందుకు చతుర్నేత్రుడు నొసలు చిట్లించి తల పంకిస్తూ యిలా అన్నాడు.

"ఇదంతా ఏకాకిచేసిన మోసం! అంత చిన్న వయసులోనే అతడెంత కల్మషబుద్ధి కలవాడో యీ ఒక్క సంఘటనా తెలియ జెబుతుంది. మా పల్లెలోని పిన్న పెద్ద లందర్నీ నేను దయ్యాన్నని నమ్మించగలి గాడు. తరవాత పది సంవత్సరాలవరకూ నేను దయ్యంగానే అడవుల్లో తిరుగుతూ బ్రతకవలసి వచ్చింది."

—(ఇంకావుంది)






# రామనగర రాజు

ఒకానొకప్పుడు గంగానదీ తీరాన రామనగరానికి ఒక రాజుండేవాడు. ఆయన కిద్దరు కుమార్తెలూ, ఒక కుమారుడూ ఉండేవారు. ఆయన మంత్రి వక్రబుద్ధి రాజ్యకాంక్షగలవాడై రాజును తన నౌకర్లచేత హత్య చేయించి, పిల్లలను చీకటి కొట్లో పడవేశాడు. తరువాత వక్రబుద్ధి రాజకుమార్తెలను కడతేర్చాడు. ఐదేళ్ళ వయసుగల రాజకుమారుడు ప్రమదుణ్ణికూడా హత్య చేద్దామనుకున్నాడుగాని ఒకవింత జరిగింది.

రాత్రివేళ చీకటి కొట్టు ప్రవేశించిన హంతకులు ఒకమూల నిద్రిస్తున్న ప్రమదుణ్ణి చూసి బెదిరిపోయారు. ఏమంటే ఆ కుర్రవాడి శరీరం ఆ చీకటిలో కాంతివంతంగా ప్రకాశిస్తున్నది.

"ఈ కుర్రవాణ్ణి చంపటానికి మాకు ధైర్యంలేదు, బాబో!" అని హంతకులు అక్కణ్ణించి పారిపోయారు.

వక్రబుద్ధికేమీ పాలుపోలేదు. ఆయన సుమిత్రుడనే బెస్తవాణ్ణి పిలిపించి, "ఓరీ, నేను చెప్పినట్టు చేస్తే నీకు కావలసినంత ధనమిస్తాను. నిరాకరించావో తల తీసేస్తాను," అన్నాడు.

కటిక దరిద్రుడైన సుమిత్రుడు వక్రబుద్ధి చెప్పినట్టు చెయ్యటానికి సమ్మతించాడు. వక్రబుద్ధి రాజకుమారుడైన ప్రమదుణ్ణి బట్టలతో కప్పి మూటలాగా చుట్టించాడు. సుమిత్రుణ్ణి చీకటి కొట్టుకు తీసుకుపోయి, "ఈ మూటను నీ పడవలో తీసుకుపోయి, దీనికి బరువైన రాయి కట్టి అర్ధరాత్రివేళ కాశీకి ఎగువ గంగలో వదిలిపెట్టాలి. పో! వెంటనే మూట తీసుకు వెళ్ళు!" అన్నాడు వక్రబుద్ధి.

సుమిత్రుడు మూట యెత్తుకుంటూనే అందులో ఎవరో ఉన్నట్టు గ్రహించాడు. కాని మారు మాటాడకుండా ఆ మూటను

బి. నాగరాజు




తన ఇంటికి పట్టుకుపోయాడు. ఇంటికి పోయాక మూట విప్పిచూస్తే మెరిసిపోతున్న కుర్రవాడు కనిపించాడు. సుమిత్రుడికి పిల్లలులేరు. అతని భార్య ఈ బిడ్డను చూసి, "నా తండ్రి! నా బంగారు తండ్రి! మనం ఈ అబ్బాయిని పెంచుకుందాం," అన్నది

సుమిత్రుడు మారు మాటాడకుండా ప్రమదుణ్ణి తన పూరిఇంట దాచాడు. పాత గుడ్డలు మూటగట్టి, వాటికి పెద్ద రాయికట్టి తన తెప్పలో పెట్టుకుని గంగానదిలో ప్రయాణం సాగించాడు. కొన్నాళ్ళకు కాశీ నగరంమీదుగావెళ్ళి నడిగంగలో మూటను రాయితోసహా జారవిడిచాడు. ఇదంతా రహస్యంగా కనిపెడుతున్న వక్రబుద్ధి నౌకర్లు పని పూర్తి అయిందని తమ రాజుతో చెప్పారు.

కొన్ని రోజులు గడిచినవి. సుమిత్రుడికి వక్రబుద్ధి అన్నప్రకారం ధనమివ్వలేదు. ప్రమదుడి రహస్యం బయట పడుతుందని కూడా సుమిత్రుడికి భయం పట్టుకుంది. అందుచేత అతను ఒక చీకటిరాత్రి తన భార్యతోనూ, ప్రమదుడితోనూ బయలుదేరి రామనగరు విడిచి వెళ్ళిపోయాడు.

కొద్ది మాసాలపాటు అడవులూ, కొండలూ దాటి సుమిత్రుడు మధురానగరం చేరుకున్నాడు. ప్రమదుడి పేరు కుముదుడు అని మార్చాడు. సుమిత్రుడు తన భార్యాబిడ్డలతో వ్యవసాయం చేసుకుంటూ ఏదో విధంగా కాలం గడపసాగాడు. రానురాను కుముదుడు దృఢకాయుడుగా, అజానుబాహువుగా తయారైనాడు. భారతకాలం నాటి భీముడిలాగా కుముదుడికి మల్ల యుద్ధం చెయ్యటంలోనూ, అద్భుతంగా వంటచెయ్యటంలోనూ నేర్పు లభించింది.

మధురానగరానికి రాజు లేడు. రాజకుమార్తెకు రక్షకుడుగా గజవర్మ అనే రాజబంధువు ఉండి, పరిపాలన నిర్వహి

స్తున్నాడు. రాజకుమార్తెకు యుక్తవయసు వచ్చి వివాహం కాగానే ఆమెను పెళ్ళాడే రాజకుమారుడు మధురకు రాజు కావాలని చనిపోయిన రాజు శాసించాడు. రాజకుమార్తె గుణవతికి యుక్తవయసు వచ్చిందిగాని ఇంకా వివాహం కాలేదు.

గజవర్మకు వినోదాలంటే చాలా ఇష్టం. ఒకనాడాయన రాజభవనంలో మల్లయుద్ధాలు ఏర్పాటుచేసి దేశంలోని మల్లులందరికీ ఆహ్వానాలు పంపాడు. అనేక వందలమంది మల్లులు వచ్చారు. అనేక వేలమంది ప్రజలు మల్లుల బలప్రదర్శనాలను చూడవచ్చారు. ఈ విధంగా వచ్చిన వారిలో కుముదుడు కూడా ఉన్నాడు. సాయంకాలందాకా మల్లయుద్ధాలు జరిగాయి. అందరినీ ఓడించిన గజమల్లును బహూకరించబోతూ గజవర్మ, "ఈ మల్లుణ్ణి గెలవగలవారు ఎవరన్నా ఉంటే ఈ బహుమానం వారికే ఇస్తాం!" అన్నాడు.

ఈ మాట వినగానే జనంలోనుంచి కుముదుడు ముందుకు వచ్చాడు. గజమల్లుడికీ, కుముదుడికీ మల్లయుద్ధం జరిగింది. కుముదుడు క్షణంలో ఓడిపోతాడనుకున్నారు ప్రజలు. కాని అలా జరగలేదు. గజవర్మ పక్కనే కూర్చుని మల్ల



యుద్ధం చూస్తున్న రాజకుమార్తె గుణవతి కళ్ళు కుముదుడిమీదనే ఉన్నాయి. అతను ఎలాగైనా గెలవాలని ఆమె కోరుకోసాగింది.

చాలాసేపు మల్లయుద్ధం భయంకరంగా సాగిన అనంతరం కుముదుడు, గజమల్లుణ్ణి ఓడించాడు. గజవర్మ కుముదుడికి బహుమానం ఇస్తూ, "నాయనా, నా రాజ్యంలో ఇంత బలశాలి ఉన్నట్టు నాకు తెలియదు. నువు ముందే మల్లులవెంట ఎందుకు రాలేదు?" అని ప్రశ్నించాడు.

దానికి కుముదుడు, "ప్రభూ, నేను వృత్తిచేత మల్లుణ్ణి కాను. నా వృత్తి వంట చెయ్యటం," అని జవాబిచ్చాడు.



కుముదుణ్ణి గుణవతి వెయ్యి కళ్ళు చేసుకుని చూస్తూవుండటం గమనించిన గజవర్మకు ఒక దుర్బుద్ధి కలిగింది. రాజ కుమారిని ఈ వంటలవాడికిచ్చి వివాహం చేసినట్టయితే శాశ్వతంగా తానే రాజు కావచ్చు. ఎందుకంటే వంటలవాడికి రాజ్యార్హత లేదు.

పెళ్లి ఏర్పాట్లు రహస్యంగా జరిగి పోయాయి. రాత్రివేళ గజవర్మ, కుముదుణ్ణి పిలిపించి పెళ్లికొడుకును చేయించాడు. గుణవతి ఎట్టి అభ్యంతరమూ చెప్పలేదు. పురోహితుడు తెల్లవారేలోపుగా వివాహం తంతు ముగించేశాడు.



కుముదుడికీ గుణవతికీ అంతఃపురం లోనే నివాసం ఏర్పాటుచేశారు. తన భార్య వంటరిగా దొరకగానే కుముదుడు ఆమెతో ఈవిధంగా అన్నాడు:

"రాజకుమారీ, వంటవాణ్ణి పెళ్లాడానని విచారించకు. నేను రామనగరు రాజ కుమారుణ్ణి. మా మంత్రి వక్రబుద్ధి మావం శానికి తీరని ద్రోహంచేశాడు. నీ రక్షకుడు గజవర్మ నీకుకూడా తీరని ద్రోహం తల పెట్టాడు. ఈ ఇద్దరికీ తగిన శిక్ష చేస్తాను."

గుణవతి ఈ మాటవిని ఏమీ ఆశ్చర్య పడలేదు. "లోకంలో ఎందరు రాజకుమా రులులేరు. కాని నాభర్త మీరే. మీరు వంట వాడైనా, రాజకుమారుడైనా నాకు ఒకటే," అన్నదామె చిరునవ్వు నవ్వుతూ.

కొద్ది రోజులు గడిచాక కుముదుడు గజ వర్మవద్దకు పోయి, "ప్రభూ, గంగాతీరాన గల రామనగరు చాలా అరాజకస్థితిలో ఉన్నది. అక్కడి ప్రజలు దుష్పరిపాలనకు గురిఅయి నానా బాధలూ పడుతున్నారు. నావెంట చిన్నసిబ్బందిని పంపితే సునా యాసంగా ఆ రాజ్యాన్ని జయించి మన రాజ్యంలో కలుపుకోవచ్చు!" అన్నాడు.

ఈ మాటవిని గజవర్మ చాలా సంతో షించాడు. త్వరలోనే కుముదుడు సైన్యంతో



బయలుదేరి రామనగరుమీద దండెత్తాడు. వృద్ధుడైపోయిన సుమిత్రుడు ముందుగానే రామనగరు చేరుకుని తన పాతబంధువులనూ, స్నేహితులనూ కలుసుకుని రాజకుమారుడు తనరాజ్యాన్ని స్వీకరించటానికి తిరిగి వస్తున్నాడని ప్రచారంచేశాడు.

ఈవార్త కార్చిచ్చులాగా ఊరంతా వ్యాపించింది. వక్రబుద్ధి దుష్పరిపాలనలో నానా బాధలుపడిన ప్రజలు ప్రమదుడి రాక కొరకు ఎదురుచూడసాగారు. ప్రమదుడు సైన్యంతోసహా గంగ అవతలి ఒడ్డున దిగగానే అంతఃపురంలో వక్రబుద్ధిని అతని నౌకర్లు బంధించి చీకటికొట్లో పడవేశారు. యుద్ధంగాని, రక్తపాతంగాని లేకుండానే ప్రమదుడు తన రాజ్యాన్ని తిరిగి సంపాదించుకున్నాడు.

వక్రబుద్ధిని బహిరంగంగా విచారణ జరిపి అతనికి శిరచ్ఛేదం శిక్ష విధించాడు ప్రమదుడు. తరువాత అతను కొత్త మంత్రులనూ, ఉద్యోగులనూ నియమించి, దుష్ట శాసనాలన్నిటినీ రద్దుచేసి తిరిగి రాజ్యంలో సుభిక్షం నెలకొల్పాడు.

ఇక్కడ మధురలో కుముదుడి రాక కొరకు రాజకుమారి గుణవతీ, గజవర్మా కూడా ఆత్రంతో ఎదురుచూస్తున్నారు. చిట్ట



చివరకు ఎలాగైతేనేం కుముదుడు విజయుడై సైన్యాలతో తిరిగి వస్తున్నాడని వార్తవచ్చింది. గజవర్మ చాలా సంతోషించి గొప్ప దర్బారు ఏర్పాటుచేశాడు.

కుముదుణ్ణి ఊరేగించటానికీ, అతనికి స్వాగతం ఇవ్వటానికీ బ్రహ్మాండమైన ఏర్పాట్లు జరిగాయి. ఊరంతా తోరణాలు గట్టారు. వాకిళ్లన్నీ పసుపు, కుంకాలతో అలంకరించారు. వీధి గుమ్మాలలో ముత్తయిదువులు హారతులతోనూ, పూలమాలలతోనూ నుంచున్నారు. కుముదుడు తన తెల్లగుర్రంమీద ఊరంతాతిరిగి చివరకు దర్బారు చేరుకున్నాడు.

సింహాసనంమీద గజవర్మ కూచున్నాడు. అతనికి రెండువైపులా రెండు ఆసనాలమీద ప్రమదుడూ, గుణవతీ కూర్చున్నారు. గజవర్మ కుముదుడికేసి తిరిగి :

"నాయనా! నీవు మధురకీర్తిని నిలబెట్టావు. మధురకు రామనగరును గెలిచిపెట్టి ఎంతగానో తోడ్పడ్డావు. నీకు నేనేమి బహూకరించగలను?" అని అడిగాడు.

"మహాప్రభూ, మీరు పొరపడ్డారు. నేను రామనగరును మధురకు గెలిచిపెట్టలేదు. రామనగరు నాదే! దానిని శత్రువులనుండి తిరిగి సంపాదించుకున్నాను. మీరు తోడ్పడినట్టయితే రామనగరుకు మధురను కూడా గెలుచుకుంటాను," అన్నాడు ప్రమదుడు.

గజవర్మ ఆగ్రహావేశంతో, "ఓరీ, కృతఘ్నుడా! వంటలవాణ్ణి తెచ్చి నీకింత గౌరవం ఇచ్చినందుకు నా సింహాసనానికే ఎసరు పెట్టావుగా? చూడు నిన్నేంచేస్తానో!" అని హుంకరించాడు.

"నేను వంటలవాణ్ణి కాను. నాపేరు కుముదుడు కాదు, ప్రమదుడు. నేను రామనగరు రాజును. మీ దుమిక్కిలి రాజకుమార్తె భర్తను. మీకిక ఈ సింహాసనం మీద చోటులేదు. దయచేసి లేవండి," అన్నాడు ప్రమదుడు.

ఈ మాట వినగానే గజవర్మ కత్తిదూసి ప్రమదుడిమీదికి లంఘించబోయాడు. కాని మహాబలుడైన ప్రమదుడు అతడి చేతిని గట్టిగా పట్టేసరికి గజవర్మ చేతికత్తి ఖంగున కింద పడిపోయింది. అతడి చేతి ఎముకలు పటపటా విరిగిపోయాయి.

ప్రముదుడి అంగరక్షకులు గజవర్మను పట్టుకుని చెరసాల చేర్చారు. ప్రమదుడు నిండు దర్బారులో తనగాథ యావత్తూ చెప్పాడు. పౌరులు అతనిని తమ రాజుగా స్వీకరించారు. ప్రమదుడూ గుణవతీ చాలా కాలం సుఖంగా ఉండి, ప్రజలను చక్కగా పరిపాలించారు.






# ధనలోభం

పూర్వం ద్రోణపురి అన్న పట్టణంలో కడు బీదవాడైన బ్రాహ్మణుడు ఒకడుండేవాడు. అతడి పేరు సోమశర్మ. భార్యా, నలుగురు పిల్లలతో బీదరికం అనుభవిస్తూ సంసార భారంవల్ల కృంగిపోతూండేవాడు.

ఈ దరిద్రస్థితినుంచి బయటపడటం ఎలాగా అని సోమశర్మ ఆలోచిస్తూండేవాడు. ఏ రాజునో ఆశ్రయిస్తే యీ దారిద్ర్యభారాన్ని యిట్టే దింపుకోవచ్చు. కాని, రాజాశ్రయం దొరకటానికి తాను పండితుడూ, కవీ కాదాయె! పైగా తనకువున్న లౌకికజ్ఞానం కూడా అంతంత మాత్రపువాయె! యిక రాజాశ్రయం ఎలా దొరుకుతుంది?

'రాజాశ్రయం దొరక్కపోతే ఏం? ఆ రాజునూ, నన్నూ అందర్నీ సృష్టించిన ఆ పరమశివుణ్ణే ప్రార్థిస్తాను. ఆయన కరుణను సంపాయించటానికి పండిత పామరభేదం అడ్డురాదుగదా? నిర్మల భక్తితో ఆయన్ని గురించి తపస్సుచేస్తే, నా కష్టాలు తీరక పోతవా!' అనుకున్నాడు సోమశర్మ.

ఇలా అనుకొని భార్యతో తను అడవులకు తపస్సుకై పోతున్నాననీ, కొద్ది నెలల్లోనే తిరిగివస్తాననీ చెప్పి బయలుదేరాడు. కొన్నిరోజులు ప్రయాణంచేసి ఒక కీకారణ్యం చేరుకొన్నాడు. అక్కడ ఒక చెట్టుకింద పద్మాసనంవేసి కూర్చొని శివుణ్ణి గురించి తపస్సు ప్రారంభించాడు.

ఒకటి రెండు రోజులు గడిచినై. ఆకలి దప్పికలతో సోమశర్మకు శోషవచ్చింది. యిక అతడి మనస్సు శివుడిమీదినుంచి, ఆహారం మీదికి మళ్ళింది. వారంరోజులు అయేసరికి శోషవచ్చి పడిపోయి 'శివ శివ' అన్నధ్యానం బదులు, 'అన్నం, జలం' అంటూ పలవరించసాగాడు.

అలాంటి తరుణంలో ఆ ప్రాంతంనుంచే ఒక మునీశ్వరుడు ప్రయాణమైపోతున్నాడు.

ఆర్. సీతాపతి




అతడికి సోమశర్మ మాటలు వినిపించినై. అతడిదగ్గరకు వచ్చి, తన కమండలం లోంచి ఇంతనీరు అతడి గొంతులో పోశాడు. సోమశర్మలేచికూర్చున్నాడు. అప్పుడుముని:

"నాయనా, నువ్వెవరివి? ఈ కీకారణ్యంలో 'అన్నం, జలం' అంటూ పలవరించే దుస్థితి నీకెలా ప్రాప్తించింది?" అని అడిగాడు.

ముని యిలా ప్రశ్నించేసరికి సోమశర్మ, తబ్బిబ్బయాడు. తాను శివధ్యానం చేస్తూవున్నానుగదా అనుకొన్నాడు.

"స్వామీ, మీరు పొరబడివుంటారు. నేను 'అన్నం, జలం' అనికాదు అంటూవుంట, 'శివశివ' అని ఆ మహాశివుణ్ణి గురించి ధ్యానం చేస్తున్నాను" అన్నాడు.

మునీశ్వరుడికి సోమశర్మనుచూసి చాలా జాలికలిగింది.

"నాయనా, నువ్వీ అరణ్యానికి తపస్సు చేసుకొనేందుకు వచ్చావన్నమాట! ముక్తిని కాంక్షించే అనుకుంటాను," అన్నాడు దయ పుట్టిపడేట్టు.

అప్పుడు సోమశర్మకు నిజం చెప్పక తప్పలేదు. విని మునీశ్వరుడు నవ్వాడు.

"నాయనా, కేవలం ధనలాభం కాంక్షించి ఆ విశ్వేశ్వరుణ్ణి గురించి తపస్సు చేయనవసరంలేదు. అలాంటిది వృథాశ్రమ. నీకు కావలసింది ధనమే అయితే ఆ కోరికను ఏసిద్ధుడైనా నెరవేర్చ గలడు. కొంచెం నిదానించు, ఇప్పుడే వస్తాను," అంటూ మునీశ్వరుడు అక్కడి నుంచి లేచి చెట్లల్లోకి అదృశ్యుడయ్యాడు.

తరవాత కాసేపటికి తిరిగివచ్చి:

"నాయనా, ఈ కమండలం తీసుకుపో. ఇందులోవున్నది మంత్రశక్తిగల జలం. ఏ లోహంమీద అయినాసరే ఒక బొట్టు వేశావంటే-ఆ లోహం మరుక్షణంలో బంగారం అవుతుంది. యింటికిపోయి సుఖించు!" అని దీవించాడు మునీశ్వరుడు.





సోమశర్మ, మునీశ్వరుడికి నమస్కరించి యింటికి బయలుదేరాడు. రెండు రోజులు నడిచి ఒక గ్రామం చేరుకొని, అక్కడ శివాలయం దాపులనేవున్న ఒక విశ్వకర్మ యింటి అరుగుమీద కూర్చున్నాడు.

అప్పటికి మిట్టమధ్యాహ్నం కావస్తోంది. సోమశర్మకు ఆకలి దహించుకుపోతోంది. అంతలో యింటిలోపలనుంచి విశ్వకర్మ బయటికివచ్చి సోమశర్మను చూచాడు.

"అయ్యా, పనితొందరలో తమరాకను గమనించలేదు. క్షమించండి. మీరు చెరువులో స్నానం ముగించుకు వచ్చేసరికి స్వయంపాకానికి అవసరమైన సంబారాలన్నీ సమకూరుస్తాను" అన్నాడు.

సోమశర్మ సరే అని తన దగ్గరవున్న కమండలాన్ని విశ్వకర్మ చేతికియిస్తూ—

"బాబూ, దీన్ని కాస్త జాగ్రత్తపరచండి. మీ అతిథ్యానికి కృతజ్ఞుణ్ణి!" అంటూ చెరువుకు స్నానానికి వెళ్ళాడు.

సోమశర్మ అలా వెళ్ళగానే, విశ్వకర్మ కమండలం తీసుకొని యింటిలోపలకు పోయాడు. అదేసమయంలో తను కొలిమిలో వూదుతున్న వెండి మూసలోంచి వెండికరిగి కొలిమిలో పడుతూండటం కంటబడింది. 'అయ్యో' అనుకుంటూ ఒక్క గంతువేసి విశ్వకర్మ కొలిమిదగ్గరకు పోయాడు. అలా గంతువేయటంలో కమండలంలోని నీరు తొణికి ఒకటిరెండుబొట్లు అక్కడపడివున్న సుత్తెమీద పడినై. క్షణంలో ఆ యినపసుత్తె తళతళమెరుస్తూ బంగారమైపోయింది.

విశ్వకర్మకు యీ వింత మొదట్లో అర్థం కాలేదు. కమండలంలోని నీటిని ఒకటి రెండుబొట్లు పటకారుమీద వేసిచూశాడు. అదికూడా బంగారంగా మారిపోయింది.

దీనితో ఆనాటివరకూ ధర్మబుద్ధిగల విశ్వకర్మకు దుర్బుద్ధి పుట్టింది. కమండలంలోనిది మామూలు నీరుకాదనీ, మంత్రశక్తి గలదనీ గ్రహించాడు. దానిని తనదిగాచేసు




కొని భాగ్యవంతుడు కావాలనుకొన్నాడు. వెంటనే బంగారంగా మారిన సుత్తెనూ, పటకారునూ, కమండలాన్నీ ఒక గుడ్డలో చుట్టి పెట్టెలో పెట్టాడు. తరవాత ఇంటికి నిప్పుపెట్టి కేకలు వేస్తూ—ఆ పెట్టెతో బయటపడ్డాడు.

విశ్వకర్మ యింటిపక్కనే శంభుదాసు అనే గృహస్థుడి యిల్లువుంది. విశ్వకర్మ కేకలువేస్తూ ఆ యింటికిపోయి, "అయ్యో, అయ్యో! నా యిల్లు తగలబడిపోతోంది. యీ పెట్టెమాత్రం చేజిక్కించుకొని బయటపడ్డాను. మీ వుపకారం మరిచిపోను. కాస్త దీన్ని మీ ఇంట్లో దాచిపెట్టండి" అంటూ శంభుదాసును బతిమలాడాడు.

శంభుదాసు సరే అని ఆ పెట్టెను తన యింట్లో దాచాడు. విశ్వకర్మ యిల్లంతా కాలి భస్మం అయిపోయింది.

అంతలో సోమశర్మ స్నానం ముగించుకొని అక్కడికి వచ్చాడు. విశ్వకర్మ ఏడుస్తూ అతడి దగ్గరకుపోయి—

"అయ్యా, నాయిల్లంతా కాలిపోయింది. నా యావదాస్తి నాశనమయింది. మీ కమండలాన్నయినా రక్షిద్దామని ప్రయత్నించాను. మంటలవల్ల నాచేతకాలేదు. క్షమించండి." అంటూ కాళ్ళావేళ్ళా పడసాగాడు.

సోమశర్మనోట మాటరాలేదు. మంత్రజలంకాస్తా అనుభవయోగ్యం కాకుండా పోయిందే అని వాపోయాడు. కనీసం కమండలమైనా ఆ కాలినయింట్లో దొరకదా అని వెతికిచూచాడు.

ఇంట్లోవున్న రాగి, యిత్తడి పాత్రలన్నీ కాలి ముద్దయిపోయి కనిపించాయికాని, కమండలం మాత్రం కనిపించలేదు. దానితో సోమశర్మకు విశ్వకర్మమీద అనుమానంకలిగింది. మంత్రజలం యొక్క మహత్తు గ్రహించి, యితడే ద్రోహం తలపెట్టవుంటాడని భావించాడు. ఇలాంటి దుష్టుడితో వాదించి లాభంలేదని సరాసరి గ్రామాధికారి వద్దకుపోయి ఫిర్యాదుచేశాడు.

గ్రామాధికారి విశ్వకర్మను పిలిపించి నయానా, భయానా అడిగిచూశాడు. సోమశర్మ కమండలం దాచమని యిచ్చినమాట నిజమే అని ఒప్పుకున్నాడు విశ్వకర్మ. కాని తన గృహోపకరణాలతోపాటు అదీ దగ్ధమైపోయిందని చెప్పాడు.

గ్రామాధికారికి యిది నిజమేకావొచ్చని పించింది. పెట్టేబేడా, పాత్రసామగ్రి అంతా మసి అయిపోతే-యీ కమండలం చెక్కు చెదరకుండా వుంటుందా అనుకున్నాడు. 'నీకర్మ, చేసేదేముంది? ఇంటికి చక్కాపో" అన్నాడు గ్రామాధికారి, సోమశర్మతో.

విచారణ వినేందుకువచ్చిన గ్రామస్థుల్లో శంభుదాసుకూడా వున్నాడు. విశ్వకర్మ తన సామానంతా కాలిపోయిందంటాడేకాని, దాచమని యిచ్చిన పెట్టెసంగతి చెప్పడేమా అన్న అనుమానం కలిగిందతడికి. ఇందులో ఏదో రహస్యం వున్నదనుకున్నాడు.

ఇంటికిపోయి ఆ పెట్టె తీసుకొని సరాసరి గ్రామాధికారివద్దకువచ్చి జరిగినదంతా చెప్పేశాడు శంభుదాసు. గ్రామాధికారి పెట్టె తాళం పూడదీయించి చూస్తే, అందులో కమండలంతోబాటు బంగారుసుత్తె, పటకారు కనిపించినై. విశ్వకర్మచేసిన మోసం తెలిసిపోయింది.

గ్రామాధికారి విశ్వకర్మకు జరిమానా విధించి, సుత్తె, పటకారుతోసహా కమండలాన్ని సోమశర్మకు యిప్పించాడు.

సోమశర్మ అన్నీ తీసుకొని ఇంటికి తిరిగి వచ్చాడు. మంత్రశక్తిగల జలం చల్లి యింటనున్న యిత్తడి, రాగి పాత్రలన్నిటినీ బంగారంగా మార్చాడు.

ఈ విధంగా సోమశర్మ దారిద్ర్యబాధ తీరిపోయింది. అతడు చేతనైనంతలో దానధర్మాలుచేస్తూ, దైవచింతనపరుడై కాలం వెళ్ళబుచ్చాడు.






# కనిష్కుడి ఔదార్యం

చాలాకాలం కిందట కుషాణవంశస్థుడైన కనిష్కుడు పురుషపురం రాజధానిగా ఉత్తర భారతదేశాన్ని పరిపాలించాడు. అయన దైవాంశతో జన్మించినవాడనే ప్రతీతి ప్రజల్లో వుండేది.

కనిష్కుడు దయాధర్మ గుణాలకేగాక, ధైర్యసాహసాలకు కూడా పేరు పొందినవాడు. ఆనాడు బలవంతులైన అనేకమంది రాజులను జయించి తనకు సామంతులుగా చేసుకొన్నాడు. అలాంటివారిలో కన్యాకుబ్జపు రాజు ఒకడు.

కనిష్కుడి పుట్టినరోజు పండుగకు సామంతరాజులు కానుకలు పంపుతూ వుండటం ఒక ఆచారం. ఒకసారి అతడి పుట్టినరోజు పండుగకు కన్యాకుబ్జ రాజు తన కానుకగా ఒక పట్టుగుడ్డ పంపాడు.

తనకు వచ్చిన కానుకలలో యీ పట్టుగుడ్డ కనిష్కుణ్ణి ఎంతగానో ఆకర్షించింది. దీన్ని ఒక అంగరకాగా కుట్టించుకుంటే బావుండు ననుకున్నాడు. దర్జీవాణ్ణి పిలిపించి ఒక్క వారంరోజుల్లో అంగరకా కుట్టుకురావలసిందని చెప్పాడు.

వారంకాదు రెండు వారాలు గడిచినా దర్జీ అంగరకా తయారుచేసి తేలేదు. కనిష్కుడు కుపితుడై దర్జీని వున్నవాణ్ణి వున్నట్టు పట్టుకు రావలసిందని భటులకు ఆజ్ఞాపించాడు. భటులు వెంటనే వెళ్ళి అతణ్ణి కనిష్కుడి దగ్గరకు లాక్కువచ్చారు.

ఇంత అలస్యానికి కారణం ఏమిటని దర్జీని కఠినంగా ప్రశ్నించాడు కనిష్కుడు. అందుకు దర్జీ చేతులు జోడించి :

"మహాప్రభూ! యిందులో నాతప్పేమీ లేదు. తమరు అంగరకా కుట్టమని ఇచ్చిన పట్టుగుడ్డమీద రెండు పాదచిహ్నాలు నేయ

ఎస్. ఈశ్వరబాబు

బడి వున్నవి. గుడ్డను ఎటు తిప్పి కట్టినా అ పాదచిహ్నాలు తమ వీపు మీదకు రాగలవు. తమరే చిత్తగించండి!" అంటూ పట్టుగుడ్డను కనిష్కుడికి యిచ్చాడు.

కనిష్కుడికి పట్టరాని కోపం వచ్చింది. పట్టుగుడ్డను సూక్ష్మంగా పరిశీలించిచూస్తే, దర్జీ చెప్పినది సత్యమే అని తెలిసింది. ఇక అతడి రౌద్రానికి అంతులేదు.

"ఈ కన్యాకుబ్జ సామంతుడు నన్నే అవమానిస్తాడా? వాడిపొగరు అణుస్తాను" అంటూ మంత్రినీ, సేనానాయకుణ్ణీ పిలిపించి సంప్రతించాడు. వారం రోజులకల్లా సర్వసైన్యాన్నీ సమాయత్తపరిచి కన్యాకుబ్జ రాజ్యంమీదికి దండయాత్ర బయలుదేరాడు.

కనిష్కుడు సైన్యంతో తన దేశంమీదికి దండెత్తి వస్తున్నాడన్నవార్త కన్యాకుబ్జ రాజుకు తెలిసింది. బలవంతుడైన కనిష్కుణ్ణి తను ఎదిరించలేనని కన్యాకుబ్జ రాజు గ్రహించాడు. ఇక కర్తవ్యం ఏమిటి?

రాజు, రానున్న ఉపద్రవాన్నిగురించి మంత్రితో చెప్పి 'ఏదైనా వుపాయం ఆలోచించు!' అన్నాడు. అందుకు మంత్రి:

"మహారాజా! నేను ముందే తమకు ఆ రకమైన కానుక పంపవద్దని మనవి చేసుకొన్నాను. కోరి నిద్రపోతున్న తాచు



పాము తోక తొక్కాను. ఇది చేజేతులా తెచ్చి పెట్టుకొన్న వుపద్రవం!" అన్నాడు.

యిందుకు రాజు తలవూపి: "సరే, జరిగిపోయిందేదో జరిగిపోయింది, విచారించి ప్రయోజనంలేదు. ఏదో ఒకటి ఆలోచించి చేయకపోతే మనకు ప్రాణాలు, రాజ్యం రెండూ దక్కవు!" అన్నాడు విచారంగా.

అప్పుడు మంత్రి యిలా చెప్పాడు:

"ఐతే మీరు 'ఎందుకు?' అని ప్రశ్నించకుండా నా చేతిని నరికించండి."

మంత్రి యిలాంటి కోర్కె వెలిబుచ్చేసరికి కన్యాకుబ్జరాజు కళవళపడ్డాడు. ఆయనకు రాజభక్తిపరుడైన మంత్రికి అంగ




కనిష్కుడు మంత్రి చెప్పినదంతా విన్నాడు. అతడు రాజువల్ల శిక్షింపబడిన వాడనీ, ఆ శిక్షకూడా తన కారణంగానే జరిగిందనీ భావించాడు.

"సరే, ఆ పొగరుబోతుకు తగిన శిక్ష విధిస్తాను. త్వరలోనే వాణ్ణి యమపురికి పయనం కట్టిస్తాను" అని కనిష్కుడు మంత్రిని పూరడించాడు. కాని మంత్రి అంతటితో పూరుకోలేదు.

"మహారాజా, ప్రతీకారం జరిగితేగాని నాకు మనశ్శాంతి కలగదు. మీరు దండెత్తి వస్తున్నారని తెలిసి రాజు పట్టణం వదిలాడు. అతడు ఎటుకేసి పోతున్నాడో నాకు తెలుసు. మనం అతడిదారిని అడ్డగించి పట్టుకోవాలి," అని చెప్పాడు.

కనిష్కుడు సరే అని కన్యాకుబ్జరాజును పట్టుకోవటం యేలానో తెలియపరచమన్నాడు. అందుకు మంత్రి :

"మహారాజా, అతణ్ణి చేజిక్కించుకోవాలంటే మనకు రెండే రెండు మార్గాలు వున్నవి. ఒక మార్గాన్ని అనుసరించిపోతే సరిగా నలభైదినాలు పడుతుంది. రెండో మార్గాన వారం రోజుల్లో అక్కడికి చేరవచ్చును. కాని యీ మార్గం కంటకప్రాయమైంది. మైదానంలోంచి మనం ప్రయాణం

విచ్ఛేదం కలిగించటం సుతరామూ యిష్టం లేదు. కాని, చేసేది ఏమీలేక తలారిని పిలిపించి మంత్రి చేతిని నరికించాడు.

వారం రోజుల తర్వాత మంత్రి ఒక ఉత్తమాశ్వాన్ని ఎక్కి, కనిష్కుడు సైన్యాలతో వస్తూన్న మార్గానికి ఎదురుగా వెళ్ళాడు. కన్యాకుబ్జరాజ్య సరిహద్దులవద్ద కనిష్కుడిని కలుసుకొన్నాడు.

"మహారాజా, నేను కన్యాకుబ్జరాజ్య మంత్రిని. ఆయన తమకు చేసిన అవమానాన్ని వారించ ప్రయత్నించిన ఫలం అనుభవిస్తున్నాను" అంటూ మంత్రి, కనిష్కుడికి తన మొండిచేతిని చూపించాడు.

చేయవలసి వుంటుంది. నీటిచుక్క కూడా లభ్యంకాదు" అన్నాడు.

కనిష్కుడు కొంచెం ఆలోచించినమీదట యీ రెండవ మార్గాన పోవటానికే నిశ్చయించాడు. ప్రయాణం వారంరోజులే అయినా పదిరోజులకు సరిపడా నీరూ, సంబారాలూ ప్రోగుచేయించాడు. సైన్యాలతో మైదాన మార్గంలో ప్రయాణంకట్టాడు.

సైన్యాలు మైదానంలో నడుస్తున్నవి. ఎక్కడా చెట్టూచేమా లేదు. నీరు వున్న చాయలే లేవు. పైగా పదిరోజులు ప్రయాణం చేసినా గమ్యస్థానం దగ్గిరపడలేదు. ఇంకా ఒకటిరెండు రోజులు గడిచేసరికి ఆహారం మాట ఎలావున్నా, దాహం తీర్చుకునేందుకైనా నీరులేక సైనికులు బాధపడసాగారు. పదిరోజులకని తెచ్చుకున్న సంబారాలూ, మంచినీరూ అయిపోయినై.

పరిస్థితి యిలా ఎదురు తిరిగేసరికి కనిష్కుడు, కన్యాకుబ్జ మంత్రిని పిలిచి వారంరోజుల ప్రయాణం అనుకున్నది పన్నెండురోజులు అయినా గమ్యస్థానం కనబడదేమని ప్రశ్నించాడు. దానికి మంత్రి వికటంగా నవ్వుతూ—

"మహారాజా, మిమ్మల్ని కావాలనే నేనీ విధంగా మోసగించాను. మీరేమో మా



రాజును యమపురికి పంపుతానని ప్రతిన పూనారు. కాని, యిప్పుడు మీరే సైన్య సమేతంగా యమపురికి పోవలసిన కాలం సమీపిస్తోంది. మీరు వెనుదిరిగి పోవాలన్నా, లేక ముందుకే వెళ్ళాలనుకున్నా పన్నెండు రోజులు పడుతుంది. కనుక అందరూ నీటిబొట్టయినా దొరకని యీ మైదానంలో గొంతు ఎండి ప్రాణాలు విడవక తప్పదు. యింతకూ కారణమైన నన్ను ఈ నిమిషంలోనే శిరచ్ఛేదం చేయించినా ఫరవాలేదు. నా శ్రమ ఫలించింది. రాజకార్యం నెరవేర్చాను" అన్నాడు. ఈ పలుకులువిన్న కనిష్కుడు ఒక్కక్షణం నిశ్చేష్టుడయాడు.

కాని అంతలోనే చిరునవ్వు నవ్వి— "మంత్రీ, నీ రాజభక్తి ఎంతో మెచ్చదగింది! కాని ఒక సంగతి నువ్వు మరచినట్టుంది. నేను దైవాంశతో జన్మించాననేది వట్టి కట్టు కథ కాదు. నువ్వే చూద్దువుగాని" అంటూ గుర్రం ఎక్కి, దైవదత్తమైన కుంతం చేబట్టి ఒంటిగా బయలుదేరాడు.

కనిష్కుడు ఆ మైదానంలో ఒకటి రెండు మైళ్ళు చుట్టివచ్చేసరికి ఒకచోట ఎండిపోయిన పెద్ద కొలను కనబడింది. అతడు గుర్రందిగి ఆ కొలనుమధ్యకుపోయి తన చేతనున్న కుంతంతో భూమిని ఒక పోటు పొడిచాడు. మరుక్షణానే ఆ కుంతం భూమిలో దిగినచోటునుంచి ఒక జలధార బయలుదేరి ఆకాశమంట లేచింది.

"మంత్రీ, యిప్పుడు చూచావుగదా నా శక్తి ఎలాంటిదో? అనవసరంగా అంగ విచ్ఛేదం చేయించుకున్నందుకు విచారపడవలసింది నువ్వు!" అన్నాడు కనిష్కుడు. మంత్రి సిగ్గుతో తల వంచుకున్నాడు.

కనిష్కుడు తిరుగా సైన్యాలను కూర్చుకొని కన్యాకుబ్జకు బయలుదేరేందుకు సమాయత్తమవుతున్నాడు. అప్పుడు మంత్రి ఆయనను సమీపించి—

"మహారాజా, మీరు దైవాంశ కలవారని యిప్పటికి నేను గ్రహించాను. నాయందు కనబరిచిన మీ ఉదారత సాటిలేనిది. యింత ఉదారత్వమూ, దైవాంశాకల మీరు యింగితం ఎరుగని ఒక అల్పభూపతిచేసిన అవమానాన్ని సహించి క్షమించలేరా?" అంటూ వినయంగా వేడుకొన్నాడు.

కనిష్కుడు 'నిజమే' అంటూ తలవూపి, సైన్యాలను తన రాజధానియైన పురుషపుర మార్గం పట్టించాడు. మంత్రి ఆయనవద్ద శెలవు తీసుకొని కన్యాకుబ్జకు చేరి, రాజుకు ఈ శుభవార్త తెలియపరిచాడు.






# ఉపాయ బలం

ఒక ఊళ్లో విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను గర్భదరిద్రుడు. ఎంత ప్రయత్నించినా రోజు గడవక, ఇతర దేశాలకు పోయి తన తెలివితేటలతో డబ్బు గడించుకొద్దామని నిశ్చయించి, తన భార్యను ప్రయాణానికేమైనా పిండివంటలు తయారుచేయమన్నాడు.

విష్ణుశర్మ భార్య తన మెడలో పుస్తెలు విక్రయించి, వాటికి బదులు పసుపుకొమ్ము కట్టుకుని, చీకటిపడినాక కోమటింటికి వెళ్లి పిండివంటలు చేసే దినుసులు కొన్నది. చీకటిలో కోమటి ఆమెకు జాజికాయ ఇవ్వటానికి బదులు నాభికొమ్ము ఇచ్చాడు. ఆ రాత్రే ఆమె మిగిలిన వస్తువులతోబాటు ఆ నాభినికూడా నూరి, ఇరవైనాలుగు బొబ్బట్లు వేసి, అన్నిటినీ భద్రంగా మూటగట్టింది. మర్నాడు తెల్లవారుజామునే బొబ్బట్లమూట తీసుకుని విష్ణుశర్మ ప్రయాణమయాడు.

జామున్నరపొద్దు ఎక్కేసరికి విష్ణుశర్మ చాలా దూరం నడిచి అలిసి ఒక చెరువు దగ్గిరికి చేరుకున్నాడు. అయన బొబ్బట్ల మూటను చెరువుగట్టున పెట్టి, స్నానం చెయ్యటానికి చెరువులోకి దిగాడు. ఆ సమయానికే ఆ చెరువుగట్టుకు ఇరవైనలుగురు దొంగలు చేరారు. ఆ కిందటిరాత్రి రాజభవనంలో కొల్లగొట్టిన ధనమూ, నగలూ గాడిదలమీద వేసుకుని వారు అక్కడికి వచ్చారు. వారికికూడా అకలి దహించుకుపోతున్నది. అందుచేత గట్టుమీద విష్ణుశర్మ పెట్టిన బొబ్బట్లమూటను విప్పి, అందులో ఉన్న ఇరవైనాలుగు బొబ్బట్లనూ ఇరవైనలుగురూ సమంగా పంచుకుని తిని, అక్కడే పడుకుని అట్లాగే మరణించారు.

విష్ణుశర్మ స్నానంచేసి, సంధ్యవార్చి బొబ్బట్లు తిందామని వచ్చేసరికి బొబ్బట్లు లేవుగాని, చచ్చిపడివున్న దొంగలూ, వారి

పి. లక్ష్మణస్వామి



గాడిదలమీదవున్న ధనరాసులూ కనిపించాయి. ఆ సంపదను చూసి అతడు ఆకలికూడా మరిచిపోయాడు. కాని అంత ధనం ఒంటరిగా తాను ఇంటికి ఎలా పట్టుకుపోవాలో తెలిసిందికాదు.

ఇంతలో విష్ణుశర్మకు చాలాదూరాన రాజభటులు గుర్రాలమీద వస్తూవుండటం కనిపించింది. వెంటనే అతను దొంగల కత్తులన్నీ తీసి పోగువేసి, ఒక కత్తితో దొంగల నందరినీ నరికాడు. తరవాత గాడిదలమీద వున్న సొత్తంతా ఒకచోట పెట్టి, కత్తి భుజానపెట్టుకుని, దానిచూట్టూ కాపలాకాస్తున్నట్టు తిరగసాగాడు.

త్వరలోనే రాజభటులు వచ్చారు. చచ్చిపోయిన దొంగలనూ, రాజుగారి ఇంట పోయిన సొత్తునూ చూసి ఆశ్చర్యపడ్డారు. వారు విష్ణుశర్మతో, "అయ్యా, మేము భూరిశ్రవుడనే రాజుగారి భటులం. ఈ సొత్తు మా కోటలోనుంచి నిన్నరాత్రి దొంగలు కొల్లగొట్టారు. వీరందరినీ ఎవరు చంపారు? తమరు ఇక్కడ ఎందుకు పహరా ఇస్తున్నారు?" అని అడిగారు.

"అదంతా నేను మీ రాజుగారికే విన్నవించుకుంటాను. ముందీ సొమ్మంతా జాగ్రత్తపరచండి. పోదాం పదండి!" అన్నాడు విష్ణుశర్మ.

పోయినసొమ్ము తిరిగి దొరికినందుకు రాజు సంతోషించి, "అయ్యా, ఇరవై నలుగురు దొంగలనుచంపిన మీ పరాక్రమం చాలా గొప్పది. మీ సాహసంవల్ల మా సొత్తు దక్కింది. మీకు ఏమి ప్రత్యుపకారం చెయ్యగలను?" అని విష్ణుశర్మను అడిగాడు.

దానికి విష్ణుశర్మ, "రాజా! మీవద్ద అరు లక్షల సైనికులున్నారట. ఎందుకు? దండుగ! వారు దొంగలను పట్టుకోగలిగారా? వారిలో రెండులక్షలమందిని తొలగించి వారి జీతం నాకే ఇప్పించండి. నేను మీ కొలువులో ఉంటాను," అన్నాడు.

రాజు అన్నమాటప్రకారం విష్ణుశర్మను తన కొలువులోకి తీసుకుని, రెండులక్షల మంది సైనికులను పనిలోనుంచి తొలగించి వారికిచ్చే జీతం విష్ణుశర్మకు ఇప్పించాడు. కాని ఈ ఏర్పాటు మంత్రికి ఏమాత్రం ఇష్టంలేదు. కాని చేసేదిలేక మంత్రి మౌనం వహించాడు.

కొంతకాలం జరిగింది. చుట్టుపక్కల అరణ్యాలలో ఉండే భయంకరమైన సింహం ఒకటి మనుష్యులను తినమరిగి రాత్రివేళ ఊరు ప్రవేశించి అందినవారిని చంప సాగింది. దానిని చంపటానికి రాజు భటులను పంపుదామనుకున్నాడు. కాని, విష్ణుశర్మమీద కోపంగాఉన్న మంత్రి రాజుతో, "ప్రభూ! రెండులక్షలమంది సైనికుల పెట్టు మన విష్ణుశర్మగారుండగా, సింహాన్ని చంపటానికి మరొకరిని పంపటమెందుకు?" అని చెప్పాడు.

"అవును. ఆ క్రూరసింహాన్ని నేనే చంపేస్తాను. నాకు అనతివ్వండి," అన్నాడు విష్ణుశర్మ రాజుతో.

ఆ సాయంకాలం విష్ణుశర్మ, దొంగల వద్ద హరించిన ఇరవైనాలుగు కత్తులనూ తీసుకుని, ఊరిబయటికి వెళ్ళి, సింహం వచ్చే మార్గంలో ఒక చెట్టు యెక్క






కూర్చున్నాడు. చీకటిపడిన కొంతసేపటికి సింహం భయంకరంగా హుంకరించుకుంటూ మృత్యుదేవతలాగా ఆ దారివెంట వచ్చింది. చెట్టుమీద వున్న విష్ణుశర్మ దానిని కవ్వించాడు. చెట్టుమీది విష్ణుశర్మను చూడగానే సింహం మరింత భయంకరంగా గర్జిస్తూ చెట్టుకిందికి వచ్చి, నోరుతెరిచి గాండ్రించసాగింది. విష్ణుశర్మ గురిచూసి ఒక కత్తిని సింహం నోట్లోకి విసిరాడు. ఇదేవిధంగా అతడు తనవద్దనున్న ఇరవైనాలుగు కత్తులూ సింహం మీదికి విసిరాడు. త్వరలోనే సింహం ప్రాణాలువిడిచి పడిపోయింది. అది చచ్చిందని రూఢిచేసుకుని విష్ణుశర్మ చెట్టు దిగివచ్చి, దాని శరీరంలోనుంచి కత్తులు లాగేసి, వాటితో దానిని చాలాచోట్ల పొడిచి, దాని రక్తం శరీరంనిండా పూసుకుని, కత్తి భుజాన పెట్టుకుని తెల్లవార్లూ దానిచుట్టూ పహరా తిరిగాడు. మర్నాడు రాజభటులు వచ్చి విష్ణుశర్మనూ, చచ్చిన సింహాన్నీ ఊరేగింపు తీసుకుపోయారు.

రాజు విష్ణుశర్మను గట్టిగా కౌగలించుకుని, "నీ పరాక్రమం నిజంగా సాటిలేనిది. నీకు నేనేమి ఉపకారం చేయగలను?" అని అడిగాడు.

"రాజా, నేను రెండులక్షలమంది సైనికులకు సమానమని మంత్రిగారన్నారు. అది నిజంకాదు. నేను యిప్పుడు నాలుగు లక్షలమంది సైనికులకు సమానం. మరి రెండులక్షల మందిని సైన్యంలోనుంచి తొలగించి వారి జీతాలు నాకిప్పించండి," అన్నాడు విష్ణుశర్మ వినయంగా.

రాజు అలాగేచేశాడు. మంత్రికి విష్ణుశర్మమీద మరింత మంట పుట్టుకొచ్చింది. కాని ఏమీ చేయలేకపోయాడు.

భూరిశ్రవుడు తొలగించిన సైనికులు మరొక రాజువద్ద చేరారు. వారు తమ కొత్త రాజుతో, "మహారాజా! భూరిశ్రవుడిప్పుడు

బలహీనుడు. ఆయన వద్ద రెండులక్షల మంది సైనికులే ఉన్నారు. కనక ఆయన మీద దండెత్తి ఆయన రాజ్యాన్ని గెలుచు కోండి. ఇంతకంటే మంచితరుణం దొర కదు" అని సలహా ఇచ్చారు.

వారి సలహా ప్రకారమే ఆ రాజు తన సైన్యాలను ఆయత్తం చేసుకుని వచ్చి మైదానంలో విడిసి, భూరిశ్రవుడి వద్దకు యుద్ధపత్రిక పంపాడు.

రాజు మంత్రిని సలహా కోరాడు.

"మహాప్రభూ! ఈ విషమస్థితిలో నేను సలహా ఇవ్వగల సమర్థుణ్ణి కాను. విష్ణు శర్మను నమ్ముకుని నాలుగులక్షల సైని కులను తొలగించారు. అతనినే సలహా అడగండి!" అన్నాడు మంత్రి.

రాజు విష్ణుశర్మను సలహా అడిగాడు. విష్ణుశర్మ తొణకలేదు, బెణకలేదు. "మీరు శత్రుసైన్యాలను గురించి మరిచిపొండి. ఈ రాత్రే నేను వాటిని ధ్వంసంచేసేస్తాను!" అని విష్ణుశర్మ రాజుకు అభయం ఇచ్చాడు.

ఆరాత్రే విష్ణుశర్మ తన కత్తులనూ, తాను చంపిన సింహచర్మాన్నీ తీసుకుని ఒంటరిగా మైదానంమీద ఉన్న శత్రుసేనల వైపు వెళ్ళాడు. సైనికులంతా గాఢనిద్రలో మునిగి ఉన్నారు. ఒకపక్క ఏనుగులు కట్టివేసి ఉన్నాయి.



విష్ణుశర్మ ఆ ఏనుగుల మధ్యకు సింహం చర్మాన్ని విసరివేశాడు. సింహమే తమ మధ్యకు ఉరికిందనుకుని బెదిరి ఏనుగులు తమ గొలుసులు తెంపుకుని ఘీంకరిస్తూ నలుదిక్కులా పరిగెత్తాయి.

"కొట్టు! పొడు! చంపు! నరుకు!" అని విష్ణుశర్మ చీకటిలో అరుస్తూ నలుదిక్కులా పరుగెత్తసాగాడు.

విష్ణుశర్మ కేకలూ, ఏనుగుల ఘీంకారాలూ విని నిద్రలేచిన సైనికులు తమమీద అర్ధరాత్రివేళ శత్రుసైన్యాలు వచ్చిపడ్డాయనుకుని ఆ చీకటిలో కత్తులు దూసి ఒకరితో ఒకరు ఘోరయుద్ధంచేసి చచ్చిపోసాగారు.

ఈ అల్లరిలో విష్ణుశర్మ శత్రు రాజు గుడారంలోకిదూరాడు. అక్కడ రాజుగారి అంగరక్షకులెవరూ లేరు. యిదే మంచి సమయమనుకొని ఒంటరిగావున్న రాజును కాస్తా కత్తితోపొడిచి చంపివేశాడు.

మర్నాడు తెల్లవారేసరికి మైదానం శ్మశానంగా మారిపోయింది. ప్రాణాలతో బయట పడిన కొద్దిమంది శత్రుసైనికులు అక్కడ నుంచి పలాయనంచేశారు. ఒంటరిగా ఇంత గొప్ప విజయం సంపాదించిన విష్ణుశర్మను చూసి రాజు ఆనందానికి మితిలేదు.

"నువ్వు నిజంగా నాలుగులక్షల సైనికులతో సమానమైనవాడవే! నేను నీకేమి ఉపకారం చెయ్యగలను?" అని రాజు విష్ణుశర్మను అడిగాడు.

అందుకు విష్ణుశర్మ వినయంగా:

"రాజా, ఆపత్సమయంలో సరిఅయిన సలహా ఇవ్వలేని మంత్రిదేనికి? మీ మంత్రిని తొలగించి ఆ పదవినీ అతడి జీతాన్నీకూడా నాకిప్పించండి," అన్నాడు విష్ణుశర్మ.

రాజు మారుమాటాడక మంత్రిని తొలగించి ఆ స్థానంలో విష్ణుశర్మను మంత్రిగా నియమించాడు.

ఉపాయబలం మించినబలం లేదు.






# మూడు కొమ్మల మామిడిచెట్టు

పూర్వం శోణానదీతీరాన ఒక అరణ్యానికి సమీపంగా ముగ్గురు అన్నదమ్ములు ఒక కుటీరంలో నివసిస్తూ ఉండేవారు. వారు గర్భదరిద్రులు. వారికున్న ఆస్తిఅల్లా ఒక మామిడిచెట్టు. దానికి మూడు కొమ్మ లుండేవి. ఈ మామిడిచెట్టు వసంతకాలం రాగానే విరగబూచి, వేసవిలో గొప్ప ఫలా లిచ్చేది. మూడు కొమ్మల ఫలాలనూ ముగ్గురు అన్నదమ్ములూ కోసుకుని, వాటిని విక్రయించి ఏడాదిపొడుగునా ఏదోవిధంగా జీవించేవారు.

ఒక ఏడు మూడుకొమ్మల మామిడి విరగకాసింది. చెట్టుకాయలు పండబారే దాకా రోజుకొకరువంతున అన్నదమ్ములు రాత్రిళ్ళు కాపలా కాసేవారు. ఆ ప్రకారమే ఒక వెన్నెలరాత్రి పెద్దవాడు కాపలా కాస్తున్న సమయంలో ఒక పేదవృద్ధు కర్రసహాయంతో నడుస్తూ చెట్టువద్దకు వచ్చి ఆగాడు.

"ధర్మతండ్రీ, ఆకలి దహించుకు పోతోంది. తినటానికేమైనా ఇవ్వు, నీకు పుణ్యం ఉంటుంది!" అన్నాడు వృద్ధుడు.

కాపలావున్న పెద్దవాడికేమీ పాలుపోలేదు.

"నేనూ నీవంటి దరిద్రుణ్ణే, తాతా, అయినా ఆకలిగా ఉందన్నావుగనక ఈ కొమ్మకుగల ఫలాలు కడుపునిండా తిని నీ ఆకలిబాధ తీర్చుకో. ఇది నా కొమ్మ!" అన్నాడు పెద్దవాడు.

వృద్ధుడు తన చేతికర్రతో పెద్దవాడి కొమ్మనుంచి కొన్ని పళ్ళు పడగొట్టి, వాటిని ఆరగించి, "ప్రాణం దక్కించావు, బాబూ!" అంటూ తనదారిన వెళ్ళిపోయాడు.

మర్నాటి రాత్రి రెండోవాడు చెట్టుకు కాపలా కాస్తున్న సమయంలో ఈ వృద్ధుడే మళ్ళీ వచ్చాడు. ఆకలిగా ఉన్నదన్నాడు. రెండోవాడుకూడా తన కొమ్మకుగల పళ్లను వృద్ధుడికిచ్చాడు.

వి. సుభద్రమ్మ




మూడోరాత్రి ఇదేవిధంగా వృద్ధుడు మూడోవాడి కొమ్మకు గల పళ్ళను తిని వెళ్ళిపోయాడు.

నాలుగోనాడు ఉదయం అన్నదమ్ములు ముగ్గురూ గుడిసెలో ఉన్న సమయంలో వృద్ధుడు వారివద్దకు వచ్చాడు.

"బాబుల్లారా! మీరు ముగ్గురూ దయాపరులు. మీ ఋణం ఉంచుకోవటం నా కిష్టంలేదు. నావెంట రండి. మీకు ప్రత్యుపకారం చేస్తాను," అన్నాడు వృద్ధుడు.

అన్నదమ్ములు సంతోషించి వృద్ధుడి వెంట బయలుదేరారు. వారు నదివద్దకు వచ్చేసరికి వృద్ధుడు పెద్దవాడికేసి తిరిగి, "బాబూ, నీ కోరిక ఏమిటి?" అన్నాడు.

"ఈ నదిలో నీరంతా పాలైపోయి, ఆ పాలన్నీ నా సొత్తయితే నాకింక కావలిసిందేమీలేదు!" అన్నాడు పెద్దవాడు.

"అలాగే కానీ!" అన్నాడు వృద్ధుడు.

మరుక్షణం నదిలో నీరంతా పాలుగా మారిపోయింది. ఆ పాలకోసం యెక్కడెక్కడినుండో జనం రాసాగారు. పెద్దవాడక్కడే నిలిచిపోయాడు.

మిగిలిన ఇద్దరు అన్నదమ్ములతో వృద్ధుడు అరణ్యంవేపు వెళ్ళాడు. అరణ్యమధ్యానికి వచ్చాక వృద్ధుడు రెండోవాడితో "బాబూ, నీ కోరిక ఏమిటి?" అన్నాడు.

"ఈ అడవి ఉన్న మేర సుక్షేత్రమైన పొలాలైపోయి, అవి నావి అయితే నాకింక కావలిసిందేమీలేదు," అన్నాడు రెండోవాడు.

"అలాగే కానీ!" అన్నాడు వృద్ధుడు.

మరుక్షణం అరణ్యం మాయమయింది. కనుచూపుమేరకు పచ్చని పైరు గల పొలాలుమాత్రమే ఉన్నాయి. రెండోవాడు అక్కడే నిలిచిపోయాడు.

మూడోవాణ్ణి వెంటబెట్టుకుని అరణ్యప్రాంతం దాటి కొంతదూరం వెళ్ళాడు వృద్ధుడు. తరవాత "బాబూ, నీ కోరిక ఏమిటి?" అని అడిగాడు.

"నాకు నీతిమంతురాలైన భార్య కావాలి," అన్నాడు మూడోవాడు.

"అయితే నా వెంట రా!" అంటూ వృద్ధుడు దారితీశాడు. పోయిపోయి వారు ఒక రాజుగారి అంతఃపురం చేరుకున్నారు. నేరుగా లోపలికి వెళ్ళారు.

బంగారు తూగుటుయ్యేల మీద రాజూ, రాణీ, రాకుమార్తె కూచుని ఉన్నారు.

"రాజా, నీ కుమార్తెను ఈ కుర్రవాడి కివ్వు," అన్నాడు వృద్ధుడు.

అందుకు రాజు, "అయ్యా, ఇదివరకే నా కుమార్తెను పెళ్లాడటానికి ఇద్దరు రాజ కుమారులు పోటీ పడుతున్నారు. వారిలో ఎవరికివ్వాలో తేలకుండా ఉన్నది. అటు వంటప్పుడు ఆ యిద్దరినీ కాదని నా కుమార్తెను ఈ దరిద్రుడి కెలా ఇవ్వను? మీరే చెప్పండి," అన్నాడు.

"రాజా, నీవు పొరబడు తున్నావు. నీ కుమార్తెకు ఆ రాజకుమారులకన్న ఇతనే తగిన వరుడు. కావలిస్తే రుజువుచేస్తాను. ఇవాళనే ఆ ఇద్దరు రాజకుమారుల పేరా, ఈ కుర్రవాడిపేరా మూడు మామిడిటెంకలు నాటించు. రేపటికి ఏ టెంక చెట్టయి కాయలు కాస్తుందో అతనికి నీ కుమార్తె నియ్యి," అన్నాడు వృద్ధుడు.



ఒక రోజులో మామిడిటెంక నుంచి చెట్టు మొలిచి పళ్ళు కాస్తుందన్నది, రాజు నమ్మలేదు. అయినా వృద్ధుడు చెప్పినట్లే చేశాడు. మర్నాటికల్లా మూడోవాడి పేర నాటిన టెంక మొలకెత్తటమేగాక, చెట్టయి కాయలుకూడా కాసింది.

ఒప్పందానికి కట్టుపడి రాజు తన కుమార్తెను మూడోవాడికిచ్చి పెళ్ళిచేశాడు. వృద్ధుడు తన రుణంతీర్చుకుని తనదారిన వెళ్ళిపోయాడు.

రాజు, మాట తప్పలేక తనకుమార్తెను గర్భ దరిద్రుడికిచ్చి చేశాడేగాని ఆయనకు తన అల్లుణ్ణి చూచి అవమానంగానే వుంది.




అందుచేత మూడు రోజులు గడిచాక రాజు తన కూతుర్నీ, అల్లుణ్ణీ రాజప్రాసాదం నుంచి వెళ్ళగొట్టించాడు. ఆ ఇద్దరూ కాలి నడకను తమ గ్రామంలోని పాతకుటీరం చేరుకుని అందులో దారిద్ర్యం అనుభవిస్తూ కాలం వెళ్ళబుచ్చసాగారు.

ఒక సంవత్సరం గడిచింది.

నది ఒడ్డున పెద్దవాడు పెద్దపెద్ద మేడలు కట్టించాడు. పాలు దూరగ్రామాలకు కూడా పీపాలతో ఎగుమతి అవుతున్నాయి. వేలకొద్దీ జనం అతనికింద పనిచేస్తున్నారు. పెరుగు వ్యాపారమూ, వెన్న వ్యాపారమూ కూడా జోరుగా సాగుతున్నది.

ఒకనాడు పెద్దవాడి దగ్గిరికి ఒక వృద్ధుడు వచ్చాడు. పెద్దవాడు దగ్గిరే ఉండి నదిలోని పాలు పీపాలలోకి కొలిచి పోయిస్తున్నాడు.

"బాబూ, నోరెండిపోతోంది. ఆకలి దహించుకు పోతోంది. కాసిని పాలు తాగటానికి ఇప్పించండి," అని దీనంగా అడిగాడు వృద్ధుడు.

పెద్దవాడు ముసలివాడికేసి కోపంగా చూశాడు. అతను వృద్ధుణ్ణి గుర్తించకుండానే, "ఇలా అందరికీ పాలు పందేరం చేస్తే యిక వ్యాపారం సాగినట్లే! పో, యిక్కణ్ణించి!" అని కసిరాడు.

మరుక్షణం నదిలో పాలు నీరయిపోయింది. అక్కడ వెలిసిన మేడలూ, మిద్దెలూ అదృశ్యమైపోయాయి.

మర్నాడు రెండోవాడు తన పొలాలలో ధాన్యం నూర్పిళ్ళు చేయిస్తున్నాడు. పెద్ద ధాన్యపురాసి కొండ ఎత్తున వున్నది.

వృద్ధుడు రెండోవాణ్ణి సమీపించి, "బాబూ, ముసలివాణ్ణి. ఇంతగంజి కాచుకు తాగుతాను. ధర్మప్రభువులు! కాసినిధాన్యం ఇప్పించండి!" అని అడిగాడు.

రెండవవాడూ వృద్ధుణ్ణి గుర్తించలేదు.

"పోయి ఎక్కడన్నా కష్టపడి పనిచేసుకోక ముష్టికి వచ్చావా? ధాన్యం తేరగా

వచ్చిందనుకున్నావా? పద, పద," అని కేకవేశాడు రెండోవాడు.

మరుక్షణం పొలాలు మాయమయాయి. ధాన్యపురాశి, గడ్డివాములూ అదృశ్యమయి పోయాయి. చుట్టూ దట్టమైన అడవి మాత్రమే వుంది.

మూడోనాడు గుడిసెవద్దకు వచ్చాడు వృద్ధుడు.

"బాబూ, అతిథిని. పిడికెడు అన్నం పెట్టించండి!" అన్నాడు.

మూడోవాడుగాని, వాడి భార్యఅయిన రాజకుమార్తెగాని వృద్ధుణ్ణి గుర్తించలేదు.

"లోపలికి రా, తాతా? కాని నీకేం పెట్టగలం? కుండలో ఇంత గంజి ఉంది. మాతోపాటే నువుకూడా అదే తాగుదువు గాని," అన్నారు వాళ్ళు.

ముగ్గురూ భోజనానికి కూర్చున్నారు. మూడోవాడి భార్య గంజికుండ తెచ్చి మధ్య పెట్టి మూత తీసింది. కాని, ఏమాశ్చర్యం! ఆ కుండలోనుంచి వేడివేడి పదార్థాలు, షడ్రసోపేతమైనవి తెడ్డువెంట పైకి వచ్చాయి. తీరా చూస్తే చేతిలోది తెడ్డు కూడా కాదు, వెండి గరిటె. కుండ కాస్తా బంగారుపాత్రగా మారిపోయింది.

ఈ ఆశ్చర్యంలో దంపతులు వృద్ధుడేమైనదీ గమనించలేదు. అతడికోసం చుట్టూ చూసేసరికి తమ మామూలు గుడిసెకు బదులు మహారాజులుండే సౌధం కనిపించింది. ఎక్కడ చూసినా మణులూ, మాణిక్యాలూ, ఖరీదైన దుస్తులూ కనిపించాయి.

అప్పుడు వాళ్ళు ఆ వృద్ధుడు ఎవరైనదీ గ్రహించారు. తమకు యింత మేలుచేసిన వాడు, కనబడకుండా పోవటం వాళ్ళకు కొంత విచారం కలిగించింది.

ఆనాటినుంచీ ఆ దంపతులు చేతనైనంతలో దానధర్మాలు చేస్తూ ఆ రాజ సౌధంలో ఏలోటూ లేకుండా కలకాలం కాపరంచేశారు.



# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 5

ఉత్సాహంతో బెస్తవాడు, సముద్రంలోకి ఉరకవేయటానికి తగిన దుస్తులు ధరించాడు. పడవఒడ్డుకు వచ్చాడు. గభీమని ఒక్క దూకు దూకాడు. దూకే టప్పటికి నీరు కెరటాలు కొడుతూ, నురుగులు గ్రక్కుతూ, చూడ భయం కరంగా కనబడింది. అతడికి జలస్తంభనవిద్య తెలుసును. నీటిలో మునిగి, వాడు సముద్రం అడుగుకంటా పోయాడు. అక్కడ రాళ్ళు తగులుతున్నాయి.

అలా వెళ్ళగా వెళ్ళగా, కొంచెందూరంలోనే అందాలుచిలికే ముత్యాలకోట కనిపించింది. ఆ కోటచుట్టూ రంగురంగుల ఉద్యానవనం వున్నది. ఇదే తను పోదలచిన చోటు అని బెస్తవాడు గ్రహించి, అవైపు పోసాగాడు. చేరువకు వెళ్లినకొద్దీ, చంద్రుడి వెలుగునూ, చుక్కల వెలుగునూ మించిన కాంతి ప్రస రించింది. ఇటువంటి అపూర్వమైన కాంతి ఈ భూలోకంలో ఒక్క రత్న గోళానికి తప్ప మరి దేనికీ లేనేలేదని వాడికి తెలుసు.

మెల్లగా రాళ్లు తప్పించుకొంటూ, పోతున్నాడు బెస్తవాడు. దారిలో ఒక చోట నీటిపాము ఒకటి కరవవచ్చింది. రాతిపక్కకు ఒత్తిగిలి వాడు తప్పించు కొన్నాడు. మరొకచోట బ్రహ్మాండమైన పీత గిట్టలతో వాడి కాలు పట్టుకో బోయింది. ఆ గండమూ తప్పించుకున్నాడు.

ఇన్ని గండాలూ ఎలానో తప్పించుకొని, బెస్తవాడు ఆ కాంతి ప్రసరించే దిక్కుకు చేరుకొన్నాడు. మెల్లగా దగ్గరకు వెళ్ళేసరికి, ఒక దివ్యమైన పాలరాతి ఫలకంమీద రత్నగోళం చక్కగా అమర్చబడి వుంది. దాని కాంతికిరణాలు సూదులలాగా కళ్ళలోకి పొడుస్తూ, చూడ శక్యం కాకుండా ఉన్నాయి.

ఆ రత్నగోళాన్ని చల్లగా కాజేదామా అంటే, రాతిఫలకానికి ఆ చివరా ఈ చివరా రెండు భూతసర్పాలు చుట్టుకొని, రత్నగోళానికి కాపలా కాస్తున్నాయి. ఏమైనా కానీ అని, ఆ వృద్ధుడు ముందుకు పోయి, గోళం ఉండే చోటు చేరుకొన్నాడు. వాడి అదృష్టం బాగా వుండి, ఆ సమయాన సర్పాలు రెండూ నిద్రిస్తున్నవి.

ఈ అదును కనిపెట్టి, చడి చేయకుండా సాహసంతో బెస్తవాడు, రెండు సర్పాల మధ్యకూ దూకాడు! రాతిఫలకంమీదినించి తీసి రత్నగోళాన్ని చేత పట్టాడు!! మరలిపోదాంకదా అని గిరుక్కున ఇటువైపు తిరిగాడు!!!—

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 నవంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ సెప్టెంబర్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : 'బోసినో ర్విప్పితే... | రెండవ ఫోటో : ...ముత్యాల తొలకరే!'

పంపినవారు : సండూరు సుబ్బారావు, ఆరుగొలను.

(Via) కానుమోలు - కృష్ణాజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది



# వార్తలు-విశేషాలు

విజయవాడ రైల్వేస్టేషనుకు చెందిన గుడ్సు ఆవరణను విస్తరించటానికిగాను ఇండియా ప్రభుత్వం రు. 98,24,000 లు మంజూరు చేసింది.

*　　　*　　　*　　　*

భారత అధ్యక్షుడు ప్రతిఏడూ కొన్ని వారాలపాటు దక్షిణభారతంలోని ప్రదేశ ముఖ్యనగరాలలో ఏదో ఒకదానియందు గడిపేలాగు నిర్ణయం జరిగింది. ఈయేడు అధ్యక్షుడు రాజేంద్రప్రసాదుగారు మైసూరులో కొన్నివారాలు గడుపుతున్నారు.

*　　　*　　　*　　　*

అణుశక్తిని జనక్షయానికి ఉపయోగించటం అవినీతికరమని మన ప్రభుత్వం భావిస్తోంది. అణువు బాంబులను నిషేధించాలని ఐక్యరాజ్యసమితిలో భారతీయసభ్యులు చెబుతున్నారు. అణుశక్తిని ప్రజలకు ఉపయోగపడేలాగు ఉపయోగించవచ్చు. దీనికి తార్కాణంగా ఢిల్లీలోని నేషనల్ ఫిజికల్ లెబారెటరీస్ భవనంలో అణుశక్తితో నడిచే గడియారం ఒకటి ఏర్పాటు చేస్తున్నారు.

*　　　*　　　*　　　*

ప్రపంచంలో ఎత్తయిన ఎవరెస్టు శిఖరాన్ని టెన్సింగ్, హిల్లరీలు ఎక్కి విజయం సాధించారు. పోతే, ఎత్తులో రెండవదిగా చెప్పబడుతున్న గాడ్విన్-ఆస్టిన్ శిఖరాన్ని ఒక ఇటాలియన్ జట్టు ఎక్కి విజయం పొందింది. దీనిని జయించుటకు ప్రథమప్రయత్నం 1904లో జరిగి విఫలమైంది. ఈ శిఖరం కాశ్మీర్ భూభాగంలో వుంది.



ఆంధ్ర తాత్కాలికరాజధాని అయిన కర్నూలువద్ద విమానాలు దిగటానికి వీలుగా విమాన మార్గం నిర్మించటానికి కేంద్రప్రభుత్వం అమోదించింది. దీనికిగాను 13 లక్షల రూపాయలు ఖర్చవుతుంది.

* * * *

ప్రపంచంలో 55 కోట్ల బాలబాలికలున్నారు. వీరిలో 25 కోట్ల 70 లక్షలమందికి విద్యా బోధన ఉండటంలేదని ఐక్యరాజ్యసమితి తాలూకు విద్యాశాఖవారు తెలిపారు.

* * * *

మన జాతిపిత అయిన మహాత్మాగాంధీ సమగ్రజీవితాన్ని సినిమాచిత్రంగా తయారు చేస్తామని గాంధీస్మారకనిధివారు తెలిపారు.

* * * *

జులై 31 న న్యూఢిల్లీలో కళావతి శరణబాల వైద్యశాలకు కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రి అయిన శ్రీమతి రాజకుమారీ అమృతకౌర్‌గారు శంకుస్థాపన చేశారు. ఈ వైద్యశాలలో 50 మంది రోగులకు పక్కలుంటాయట. మన దేశంలో పిల్లల ఆరోగ్యవసతులు చాలా తక్కువ. ఈ దేశంలో ఏటా చనిపోయేవారిలో సగంమంది 10 సంవత్సరాలలోపు పిల్లలు. వారిలో మళ్ళీ సగంమంది ఏడాది దాటనివాళ్లు. సరిఅయిన చికిత్స జరిగినట్టయితే ఈ చనిపోయే పిల్లలలో నూటికి 60 లేక 70 మంది బతుకుతారు. ఈ వైద్యశాలలో పిల్లలకు చికిత్స చేయటమే కాకుండా, పిల్లలవైద్యంలో ప్రత్యేక శిక్షణకూడా ఇస్తారని శ్రీమతి అమృతకౌర్ చెప్పారు.

* * * *

అస్సాం, బెంగాలు, బీహారు రాష్ట్రాలలో బ్రహ్మపుత్ర, కోసి నదుల వరదలవల్ల చాలా నష్టం జరిగింది. మనదేశంలో అన్నిటికన్న పొడవైన నది బ్రహ్మపుత్ర. ఈ వరదలవల్ల బీహారు రాష్ట్రంలో జరిగిన నష్టం, లోగడ సంభవించిన భూకంపంవల్ల జరిగిన నష్టంకంటె ఎన్నోరెట్లు ఎక్కువని అంచనా వేస్తున్నారు. వరదలవల్ల నష్టపడినవారికి అవసర సహాయం చేసేందుకు ప్రభుత్వం తగిన ఏర్పాట్లు చేసింది.



# చిత్రకథ



దాసూ, వాసూ బడినుంచి తిరిగివచ్చారు. బయట వానజల్లు పడుతోంది. ఇక ఇంట్లోనే బంతి ఆట ప్రారంభించారు. 'టైగర్' బంతితోపాటు ఏగురుతోంది. బంతి తగిలి సామాను బల్లమీది బుట్టల్లోంచి ఒక ఎలుక బయటికి వచ్చింది. 'చూడూ, దాన్ని చంపేస్తాను!' అంటూ వాసు బంతిని గట్టిగా విసిరాడు.




బంతి కాస్తా అక్కడ వున్న ముగ్గుబుట్టకు తగలటం, అది అప్పుడే లోపలకు వస్తున్న పనిమనిషి నెత్తిన పడటం క్షణంలో జరిగిపోయింది. ఇక యెలా అయినా తన్నులు తప్పవనుకున్న దాసూ, వాసూలు 'దయ్యంరా బాబో!' అంటూ, పనిమనిషి చీపురు ఎత్తేలోపలే బయటికి పరిగెత్తారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by R. M. Agashe



బహుమతి
పొందిన వ్యాఖ్య

....ముత్యాల తొలకరే !'

పంపినవారు :
ఎన్. సుబ్బారావు - ఆరుగొలను

